ధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య—౨౨

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

—। ద్వితీయభాగము ।—








అహోబలపతిపండితప్రణీతము.

(పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము)

---

కాకినాడ:
కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

1929.

~~వెల రు 0-8-0.~~ 0=75 NPS

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగపీఠిక.

---

ఈమహాప్రబంధమునకుఁ గర్త యగునహోబలపతి జన్మదేశాదు లగు సామాన్యవిషయములం గూర్చి ప్రథమభాగపీఠికలో ముచ్చటించితిని. ఇంక నిప్పు డిందుఁ గలవిశేషములను వివరించెదను. ఈభాగమున ౪-౫-౬ ఆశ్వాసములు గలవు. అందు నాల్గవయాశ్వాసమున నాముక్తమాల్యదాది కాంధ్రప్రబంధరత్నములందువలెను గిరాతార్జునీయాది సంస్కృతకావ్యములందు వలెను ఋతువర్ణనము మంచిమంచి కల్పనలతోను గొప్పగొప్ప భావముల తోను జేయంబడినది. చూడుఁడు:—

### —♦ వసంతవర్ణనము ♦—

సీ. నిఖిలాగమాంతనిర్ణిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిమాపుల కింపైనఫలములు చేకూర్పఁగలుగువాఁడు
బలుజడిచేనైనయలజడి సహియించుమానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్రఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌష్ఠవైక, మూలకారణ మైనట్టి మేలువాఁడు
మాధవుఁడువచ్చె నవ్వేళ మధురలీల, వనరమాంగన యామోదమున నెలంగ.

సీ. పంజరగృహములోపల నున్కి గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి గోరిచి యశనంబుగానక గాసిల్లు హంససంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు పరహంసవారములను
నలరునీ రక్కడ నక్కడఁ ద్రావుచు వసియించు చేతనవ్రాతములను
సత్పరిగ్రహలాభంబు సంభవిల్ల, నురుతరామోద మందెడు యోగితతుల
మన్ననయొనర్చెఁ దావచ్చి మాధవుండు, కామితార్థంబు లవ్వారికొఁగనిచ్చి.

ఇందలి శ్లేషవిశేష మెంతచక్కనిదో!

### —♦ గ్రీష్మర్తువర్ణనము ♦—

గీ. కూటిపేదఱికంబు గైకొనిరి. మిగుల, నాతరము చేత బ్రతికెడునట్టివారు
ఖనన మొనరించితనుయాత్రగడపువారు, కూలిగలుగుట నవ్వేళ గూటఁబడిరి.

క. కూటికుచి పాన మొందెను, బాటిల్లెను నీళ్ల సుష్ణ పవనంబునకున్
నేటి సురతము లకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. 32

ఈ రెంటియందును స్వభావోక్తి చక్కఁగ వర్ణింపఁబడినది.

క. పడమటిసెక నుదుకఁగఁబడి, పిసికిటివస్త్రంబు లెల్ల బెట్టాఱంగాఁ
గుడిశెరమునందు నిలిపిరి, కడుఁబూతం బనుచు వానిఁ గర్మారంభుల్. 33

ఇం దాచారసంప్రదాయము కలదు.

—♦ వర్షర్తువర్ణనము ♦—

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానర రక్షణేకార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రిభోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
సౌరమంత్రోపాస్తి చతురుల కశనంబు వార్తగల్గుట గానివావి యయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింపఁ (బ్రార్థింప)శిఖరియొకింతొసఁగిచఁ జిత్రమయ్యె
జంబుగాశలకలుషులు డంబుమిగిలెఁ, గతికసంపాదనంబులు ఘనత గాంచె
నన్నదాతను నేనియు నతిథి కోరని కైన నన్నంబు గల దను టరిదియయ్యె

ఇది యథామతి మూల్యదశాయు——

"ఇల్లిల్లుఁ దిరుగ నొక్కంతెబ్బు శిఖ; యుజ్జ్వలేసంకిలోఁ బూరి యుడిపినగకి
రాఁజదు; రాఁజిన రవ్వలుకో ల్యాపాలఁ గాని కల్గదు; నూటికి దానఁగలిగ
నేని కూడఁగుట మండైనఁబెన్బొగ సుఖభుక్తి సేకూర; దాభుక్తి కనిక
బ్రాగ్భుక్తలకెతేజు బహుజనాన్నము; దీని నారులకొదవుఁ బునశ్రేయస్సు
మాజ్యపటముఖ్యులయు మెన్న; రాలయాంగ
దాహులయు మొన్న రంతికః కాంజనిక
పచన నాంధ్రగృహిణి రానిఁ బడుక మరుఁడు
వెడవెడనై యార్ప నొగిలి రజ్జడిసి గృహులు.

ఉ. కాలువలెల్ల బల్నదులకై వడిఁ గాంచె నదీలలామముల్
గేలిగొనంవర్ధ్రఁగాఁ గడఁగెఁ గేవల మబ్ధి నతండు నీరమా
త్రాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికారహేతువుల్
చాల మెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్.

ఇందలి యర్థాంతరన్యాసము మహాకవి కాళిదాసుని కుమారసంభవములోని "వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః" అను శ్లోకమునుండి గ్రహింపఁబడినది.

కప్పు లిట్టి మనోహరము లగుకల్పనలను భావములను బద్యభాగాదులను దత్తద్ధ్యానతత్పరులై యనుకరించుచుందురు. దానిని నసమర్థతచేఁ జేసిన గ్రంథచౌర్య మనరాదు.

—♦ శరదృతువర్ణనము ♦—

క. జీవన మంతయు లోకో,జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి వడసి మై
కేవలపలితంబుగఁ దాఁ,బోవదె ఘనపాళి యుక్తపుంగవు దిశకున్. ౧౧౭

ఇందు భారతీయులకుఁ బరమపురుషార్థసాధన మగు మహాప్రస్థానము ప్రబోధితము.

—♦ హేమంతర్తువర్ణనము ♦—

శా. తమ్ములదాయ మేల్గనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచుచి
చ్చు మ్మరియూద విరాజి నడిఁజొప్పఁగఁ దమ్ములతోడ నాత్మస
ఖ్యమ్ము భరించు కల్వలును గాఱియఁ జెందెను మిత్త్రవర్గఘా
తమ్ము నెఱుంగఁ డయ్యె నుచితస్థితిఁ గాంచ జడుండు నెప్పుడే. ౧౧౮

ఇందలి యర్థాంతరన్యాసము సర్వకాలములందును సర్వజనులకు ననుభవసిద్ధమైనది.

—♦ శిశిరర్తువర్ణనము ♦—

ఉ. శీతము చేత బాధపడు చిత్రి జగంబు భరింపఁగా జగ
ద్ధాత్రిత దినేశుఁ డీశ్వరితఁ డాల్చుదు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురి నేగుచు న్నిటలచంచనచంచలదృష్టి కించిదు
న్మీలితము చేసెఁ గావలయు నెమ్మెఘటిల్ల హరించు శీతమున్. ౧౧౯

ఇందలి స్వభావ మెంతబాగుగనున్నదో! మఱియు నీభావము, "బ్రహ్మస్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయంకాలే సదా విష్ణుః త్రిమూర్తిర్హి దివాకరః" అను శ్లోకభావమూలకము.

క. అప్పప్ప యేరికైనను, జెప్పంగా శక్యమా నె శీతము మహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్. ౧౨౦

చూచితిరా యతిశయోక్తి మహిమ!

(2) పంచమాశ్వాసమున— శ్రీకృష్ణుఁడు ధర్మరాజును జూడఁబోయి యర్జునునితోఁ గలిసి యమునానదీతీరమునకు వేఁట కేగి యటఁ దనకై తపము చేయుచున్న కాళిందిం జూచి యామెను దనపురమునకుఁ దీసికొనిపోయి వివా

హాను చేసికొనియె ననుకథ సహృదయ హృదయోల్లాదకమ్మైన రసగం
భీరకల్పనావిశేషముగల నాటయుఅవది గద్యపద్యములతోఁ జక్కఁగ వర్ణింపఁ
బడినది. చిత్తగింపుఁడు.

ఇంక ప్రస్థవర్ణనాసందర్భమున నీవిద్వత్కవి తనకుఁ బరిపూర్ణప్రజ్ఞగల
యష్టభాషావిశేషము నెట్లు చూపెనో.

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధార తారుచిమంతంబు వ్యత్యయకారోర్వపవత్యనుగత
మనుసృతభవికలాపాయోగసిద్ధంబు రేఫోపహతదృష్టోల్లిఖితంబు
అన్యథాభావపరిణామనిరూషంబు సప్తాంగరూపప్రశస్త మహిమ
మైవిరాజిల్లు నష్టభాషావిశేష, సముదయస్ఫూర్తి హాసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందముగఁగాంచె నమ్యయండు.

ధర్మజుసభక్తిగౌరవము లెట్లు చిత్రించెనో చూపుఁడు—

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీకుపటభక్తి చేకొని నిలిచినాఁడ, నితఁడను నెఱుంగఁగద యిట నీవెసాక్షి.

గీ. తిమము హరియించి వస్తుతత్వంబుఁ దెలుప, నీవకాక న్యచేనత నేర్పుగనదు
దురితసంహారజగతి ఖద్యోతుటుహిను, యొవరు నేరిట్టిఁ దలఁపఖద్యోతమునకు.

ఈవిద్వత్కవి తన శాస్త్రీయజ్ఞానమును 17 వ పద్యమునఁ గాళిందీతీర
కాంతారమును మీమాంసా తర్కవ్యాకరణ చ్ఛందోలంకార భరతశాస్త్రము
లతోను బాగ్రకృతిత్రిలింగభాషలతోను నుత్తమకావ్యంబులతోను శ్లేషించి పోల్చి
చూపెను. శ్రీకృష్ణుని వివాహసందర్భమును 73వ పద్యములో నాదబ్రహ్మమును
నిరూపించెను.

"మంచిభోజనము" అను 140 పద్యమున హాస్యరసలవము.

"పగలుగావించు" నను 155 పద్యములో నప్పగింతలలోఁ బిల్లలు పెద్ద
లలు దున్నగుణము గ్రహింయింపవలయును, గాని పెద్దలందు దోష మున్నను
గ్రహింపరా దనునీతి చక్కఁగా బోధింపఁబడినది.

(3) ఇఁక షష్ఠాశ్వాసము.

ఇందుఁ గాళిందీకృష్ణుల సరససల్లాపములు వర్ణింపఁబడినవి. కాని నాగ
రకులకు వెగటుగల్గించు మోటువర్ణనము లెందును లేవు. ఇంతియే కాదు
కేవలశృంగారప్రధానము లగుపట్టులందుఁ గూడ నీవిద్వత్కవి యావిషయమును

దశ్లేషమహిమచేఁ గావ్యముతోను శాస్త్రములతోను నాగమములతోను సంస్కృతప్రాకృతాంధ్రభాషలతోను మూలప్రకృతి (అవిద్య) తోను బ్రహ్మముతోను బోల్చి చదువరుల కానందములం దనాదిపరమసిద్ధాంతముల నాయెను. వీనికిఁ బూర్వభాగమునందుఁగూడఁ జాల నుదాహరణములు గలవు.

41 వ "కామితమేమియున్" అనుపద్యములో "సర్వత్ర జయ మన్విచ్ఛే త్పుత్రా దిచ్ఛే త్పరాజయ" మ్మనుదాని భావము గలదు.

"హృదయగంధి" యను 42 వ పద్యములో "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యన్తే సర్వసంశయాః, తస్మిన్ దృష్టే పరావరే" అను నుపనిషత్సారము నిమిడించెను

"నేరుపుమీరఁ" అను 49 వ పద్యములో శృంగారరసము నలు పను సంప్రదాయము తెలియఁజేయఁబడినది.

56 త్రిమ్మడి యుత్తమనిబంధము (కావ్యము)

60 కబరి యుత్తమకావ్యముం బోలును.

సీ. ద్వాత్రింశదుపహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనాభావితస్వ
శేషశేఖరిగలిగిత్రిలింగదేశ, సూక్తమనఁ బొల్పుఁగస్తూరిచుక్కబొట్టు. 67

ఇందుఁ గస్తూరి చుక్కబొట్టు ప్రాకృతత్రిలింగభాషలవలె నున్నది.

70 చప్పుడిపందుకుఁజూచిన నీలాపనిందవచ్చెను.

86 కార్యసాధనవిధానము మంచి దను నీతి బోధింపఁబడినది.

90 "వనిత యెరుగన్ను" అనుదానిలోఁ దపము (నిరంతరదీక్ష) బలిమిని గార్యసిద్ధిని గలిగించు నను నుత్తమసిద్ధాంతము.

97 "వాగ్భూషణంభూషణం" అనుదాని యభిప్రాయము.

113 లజ్జ నవిద్యతోఁ బోల్చి గురూపదేశమున నవిద్య నశించు నను మహాభావము స్ఫురింపఁజేసెను.

124 "సాంజనాతి"—ఇందుశబ్దచిత్ర మయిన యమకము.

138 "బ్రహ్మ మనఁబొల్చు"—అద్వైతసిద్ధాంతము. చూచితిరా శ్లేషమహిమ! అతిశృంగారములోనుండి మహావేదాంతమునకుఁ గొనిపోయినది.

145 "సరితబింబోష్ఠి"—ఇందుఁ గల్పనావిశేషము.

151 "మృదుపదమై"—282 "సుప్రసాదత"—ఇందు రసావహమైన శ్లేషము గూడ గుణమగు నను కవిభావము తోఁచుచున్నది.

163, 236 గగనకుసుమము-అప్రసిద్ధ మని లౌకికుల సంప్రదాయము.

174 "పయోధరమండలము" అను శ్లేషరూపక మహిమచే వర్షాకాలము ప్రత్యక్ష మగుచున్నది.

176 త్రివేణీస్నానమున ననంత సౌఖ్యముకలుగు నను పౌరాణికభావము.

188 తపముచే నణిమాదిసిద్ధులు గలుగును.

191 ఆత్మస్వరూపమును బైలుపఱచువిధాన మతినిపుణముగా నిరూపింపఁబడెను.

197 గురుశుశ్రూష పరమసుఖంబు.

202 రూపకమహిమ మిందుఁ గలదు.

223 ఈపద్యమునందు (అహింభయము) స్వపక్షభయము గలరాజు రాజ్యము క్షీణించు నని చూపఁబడినది.

229 బ్రహ్మతత్త్వము.

230 భగవంతుఁడు సర్వద్రష్ట.

241 భగవంతుని దర్శనమైనప్పుడు సర్వహృదయగ్రంథులు వీడిపోవును.

270 ఈగద్యము ప్రథమాశ్వాసములోని "నెంజియుజగజ్జన్మాది" అను పెద్దగద్యమువంటిది. ఒకవిశేషము—అం దర్థాలంకారములే గలవు. ఇందుఁ గొన్ని శబ్దాలంకారములును గలవు, కుండలిబంధము, నాగపద్మబంధము, మాలికా బంధము నిట్లు "నానాలంకారలీలామహాస్పదంబై తనరు."

మొత్తముమీఁద నీమహాప్రబంధమున శృంగారరసము ప్రధానము. మిగిలినవి యంగములుగా నక్కడక్కడ నౌచిత్యానుసారముగా నిరూపింపఁబడినవి. కదళీపాకము ప్రాయికము. అక్కడక్కడ నారికేళపాకము గూడఁ గలదు. శైలి లక్షణలక్షితము. గుణాలంకారము లత్యంతమనోహరములు. రీతివృత్తులు రసానుగుణంబులు. భావంబు లతిగంభీరంబులు. అనర్గళ మగుకవితాధార. దానికిం బదిరెట్లు వేదవేదాంత సంస్కృతప్రాకృతాంధ్ర వ్యాకరణ తర్కమీమాంసాలంకారాది సకలశాస్త్రసర్వతోముఖపాండిత్యమహిమ. దానికి నూఱురెట్లు శ్లేషచమత్కారము. విద్వత్కవి రచించిన యీమహాకావ్యమునందలి భావములు సుబోధము లగుటకు విపుల మగు వ్యాఖ్యాన మపేక్షణీయము. మన యాంధ్రసాహిత్యపరిషత్తువారు తగిన యత్న మొనరించి వ్యాఖ్యానము చేయించి ప్రకటింపఁ గడంగుదురు గాక! మూలమూలల నున్న యిట్టి

మహాగ్రంథములను సంపాదించి ప్రకటించి కవులకీర్తులను చిరస్థాయులుగాఁ జేయుచున్న యీపరిషత్తువారికి జగత్కారణం బైన శివకేశవాది నామములచే భావింపఁబడు పరబ్రహ్మము దీర్ఘాయురారోగ్యైశ్వర్యజ్ఞానసంపదభివృద్ధులను జగదుపకారకృత్యనిరంతరదీక్షాదక్షతల నిచ్చుఁగాక !

సీ. చిలుకపలుకులు చెవులకుఁ జెలువుగొలుపు
నట్లి దక్షిణవాక్యము లాత్మతృప్తి
సలఁజేసెను శ్రీగు నారాయణాత్మ
ముదముగన లోకబుధులు ప్రమోదరూప !

ప్రమోదదక్షిణాయనము,
పిఠాపురము,

శ్రీపాదపాపయ్యశాస్త్రి.
శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థాన పండితుఁడు.

# కాళిందీకన్యాపరిణయము

## ద్వితీయభాగము.

— విషయసూచిక —

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

---

### —చతుర్థాశ్వాసము—

క. శ్రీమద్భార్గవరామవి, రామశరస్తోమధామ రమ్యభుజబలో
ద్దామాభిరామ నుతసు, త్రామా సాకేతధామ దశరథరామా. ౧

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము ౨

### —♦ వసంతర్తువర్ణనము ♦—

క. అంతట విమలక్ష్మీగత, సంతతసుమనఃకదంబరంజీవనతం
త్రాంతై సురభికి మిక్కిలి, వింతై *యేతెంచె సురభి విరహులు †బెగడన్.

గీ. ఉదయరాగచ్ఛదంబు మైనూని కొనఁగఁ, దలఁచి వనలక్ష్మిజీర్ణచ్ఛదంబువిడిచె
మాధవుసిరాక కని వృక్షమండలంబు, దాల్పఁగనుబ్బుజీర్ణచ్ఛదంబు‡రాలె.

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే §నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిమాన్యుల కింపైనఫలములు చేకూర్పఁ గలుగువాఁడు
బలుజడిచే నైనయలజడి సహియించు మానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్ర ఘటించు మధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోపరంతరసౌష్ఠవైక, మూలకారణ మైనట్టి మేలువాఁడు
మాధవుఁడు వచ్చె నవ్వేళ మధురలీల, వనరమాంగన యామోదమున మెలంగ

సీ. తనను దక్షిణజగత్ప్రాణున కేవేళఁ జెనఁమాద్యగుణంబు సేయుకతన
నతిరక్తపల్లవప్రీతి వర్ధిలఁజేయు నభ్యుదయంబుచే నడరుకతన
నఖిలనిస్సంగుల నాయాసపడఁజేయు నీలదేహుల శక్తి నేర్పుకతన
సుమచిరాకృతి జాతిసుమనోవిలాసంబు కొదవకు నొడిగట్టుకొన్నకతన
నప్రిహత కాలప మైనకతన, నధికసాంద్రరజోవ్యాప్తి నందుకతనఁ
గలుగునయశోవితానంబుకరణిగనుచు, నళులుచరియించునామనినాళిగొనుచు.

చ. అలములచే జగద్విజయ మందె మనుం దన యుక్తిభూషకుం
గలుగును లక్ష్యమన్న నది గాదు జగజ్జయసాధనంబు లై
మెలఁగెడు చాపబాణములు మేలుగ నిర్మితి చేసి మాధవుం
డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్యమా. ౭

---

*యేతెంచు-మూ. †పొగడన్-మూ. ‡పోతెక్కి §నెగడువాఁడు-అనుటమంచిది.

మ. ధరఁ బాదంబులు నాటి మాఁ బ్రిస్పదుచు వంధ్యాత్వంబు పోఁగోరి యు
త్తరురాజు ల్కడు మాధవుం గొలువఁగా దద్వాంధ్యతోత్సాదన
స్ఫురణోద్యత్ప్రసవాభిరామఫలసంభూతు ల్ఘటింపించు త
త్కర(ర)దత్తాయణనుంతిరితాక్షత లనం గానంగనయ్యె న్నసల్. ౮

క. ఫలగర్భతఁ గొను లతికా, కలకంఠ కుసుమగుచ్ఛఘనవక్షోజం
బుల మిగుల నొప్పు గైకొను, నలికోచిశ్యామచూచుకాంచితరోచుల్. ౯

గీ. పంబురసమునసుమనశ్కదంబకంబు, కాలగతి (?) దువుపకాంతలఁజాలఁగూడఁ
దత్సమాయూతిమైనపాతకముకతన, విరిసెఁగాఁబోలు ననన్దిఖిరియుచుండె ౧౦

చ. అగయఁగఁ బుష్పవత్యభిధ నంటి రజోవతు లన్న పేరిచేఁ
బరఁగుఁ తాలతాంగులయభంగురసంగతిఁ బొంగి సమ్మద
స్ఫురితనినాదము ల్గొనుట చోద్యమె మత్తమధువ్రతాళికిం
గర మురమైన యవ్వ్రజితకాళిమ మేనున నంట నబ్రిసే. ౧౧

క. గిఱకపడి కొనలు సాఁగక, యొఱలులతాంగనలఁ బొంచి యొప్పఁగఁ బుష్పం
బఱఁ బుష్పమొగ్గగుబ్బలు, వఱల ఫలం బెసఁగఁజేసె వలపుబుతు వొగిన్. ౧౨

క. మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతి యొసఁగు సర్వాగమముల్
మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతిదములు సర్వాగముముల్. ౧౩

క. మును వృద్ధికి ఘనులొసఁగిన ఘనబుణ మొగిఁదీర్పఁ దమలుకమ్రసుమపుటం
బున బొదిగి బుణముఁ దీర్చెను, గనదళిదంభంబుదాల్చి ఘనదూతలకున్ ౧౪

సీ. బంఘురము లైనయులవనస్పతుల కెల్ల, సౌమనస్యంబు విఘటిల్ల భూమిజాత
భానమాకులపాఁకొందఁబరఁగు*దున్ఘ శంబు గానటసుధుపవ్రజంబుమిగిలె. ౧౫

చ. వరివసమాళికాకలితవాసన లూనుచు మాధవీమనో
హరసుచి కాస్వదం బడుచు నాత్తసుహాగముఁడై కుజాతివి
స్ఫురణము మాన వర్తిలుచు భూరికవివ్రజమాననీయుఁడై
పరఁగెను మాధవుం డపుడు ధన్యఘనాకృతి మాధవాకృతిన్. ౧౬

గీ. యోగుల ధరించి యగిచకరియుక్తిమించి, భోగిసంసేవితాకృతిస్ఫూర్తిఁ గాంచి
మాధవుఁడుమాధవుండగుటదిఁగలంప, నలయపాంసులతాగుణంబదుదు గాని౧౭

సీ. పంజరగుహాలలోపల నున్కఁ గైకొని శర్కర మెక్కెడుజంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబు గానక గాసిల్లు మూనిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు వనహంసవారములను
నలయుని రక్కసనక్కడఁ దాఁగ్రుచు వసియించు చేతనవ్రాతములను

*ఘనస్తనంజనా—పురా.

సత్పరిగ్రహాలాభంబు సంభవిల్ల, నుకృతరామోద సుందెడు యోగితతుల
మన్ననయొనర్చెఁ దావచ్చి మాధవుండు, కామితార్థంబులవ్వారిగాఁగనిచ్చి ౧౭

గీ. దీర్ఘవిశ్రుతశబ్దవృత్తిప్రకాశ, మాశ్రితాంచితమాధుర్య మధిగతప్ర
సాదమైయొప్పెనపుడువసంతఋతువు, మహితకావ్యప్రకాశకృన్మతమువోలె ౧౮

కం. పల్లవపేశలశయ్యా, వేల్లద్రీసులకుఁ దనిసి విమలధ్వనులం
బెల్లనయుచుఁ బుంస్కోకిల, తల్లజులు వసంతవేళఁదనరిరి మిగులన్. ౨౦

చ. తెలిపుపునీటివర్షము లుదీర్ణములై యొనరంగ నత్తఱిన్
మలయుఁగఁజొచ్చెఁ బుష్పసీధుమారము లెల్లెడల న్నిరంతరా
కలనవహించి దట్టమయి కానఁగనయ్యెరు యోగదూరతం
గలఁగెను దంపతిప్రతతి గాంచుమహోష్మపుటూర్పుగాడ్పులున్. ౨౧

సీ. ఉవిదపుక్కిటపుర యుమిసిన నొక్కఁసుకెరువు పాదాబ్జఘాతమున నొకటి
చెట్టు, వేఱొక్కటి తిట్టుచు డాసిన నామోదసంపద సందినెలయు
ముద్దుల నగవుల మురిపెంపుఁబాటలఁ గౌఁగిలింతలఁ బ్రేమఁ గనుఁగొనుటల
నడుగుట నూర్చుట హస్తసంస్పర్శలఁ గొన్నిమహీజముల్ చెన్నుగొనియె
నవనియందు నచేతనతానుభూతి, గనిఁ ద్రుమాంకులు కామినీఘటితగౌర
వానమానంబులొకటిగానలగరసికు, లలను చెంతఁడు హోవింతయుతివపొంత ౨౨.

గీ. చెలువుమీఱినయవ్వేళఁ జిత్ర, మొదవ, నెమ్మిగైకొనె మెలఁగెను నెమ్మిరొదలు
నెపుడుఁ బాయనివైజాత్యమిరవుకొన్న, యట్టినయ్యును సాజాత్యమాశ్రయించె.

సీ. అరిసానుభూతుల సరిసానుభూతులై మెలఁగుచుఁడఁగఁజేయు మేలుశక్తి
లేఁగొమ్మపొందులు లేకయుండెడువానిఁ దద్వృత్తసంధింపఁ దనరునేర్పుఁ
బ్రసవవాసనలేక బడలుచుండెడువానిఁ బ్రసవాప్తినమరించు ప్రబలమహిమ
పల్కు లింపులు మీఱఁ బలుకనేరనివానిఁ బలుకదిద్దినయట్టి పాటవంబుఁ
గలిగినవయోగిజనములఁగడుముదమున, నెనయఁజేయుపవంత యోగీంద్రుఁగన్న
యోగరహితజనంబులయుల్లములను, బెల్లు వర్తిల్లకుండునె పల్లటములు

కం. సురభీరయమార్గచరా, స్థిరమాశన సమ్మదశ్రుతే ర్భవతి కుహూ
పరిహర్తా నేత్యేవం, పరవాక్కుల నవిరళముగఁ బలుకం బికములే.(?) ౨౩

ఉ. పంకజకోశపుష్పపుటభాసిమిళిందవిలాసవాసమై
యంకురసూచికావినిహితాహితమండలజీవితంబునై
శంకిలఁజేయు నాభరతశాస్త్రము నామని దానిజూడఁగా
సంకురమూను మోదభర మన్యనిరీక్షణఁ గల్గి నేర్పునే ౨౪

## —♦ గ్రీష్మఋతువర్ణనము ♦—

క. అంతట వేసవి దోఁచె ను, రంతమహోష్మానుగతనిరంతరమిత్త్రై
దంతాభ్యర్హితమతద్రు, ష్టాంతమరీచిమాలి తా శాంతంబై. ౨౭

క. వనముననోఁకవిత మను, సురభిం బ్రజపంగ భువనశోషకతిగ్మా
కరదనుజుఁడు వడిగఁ దదా కరవిపినంబులను మిగులఁ గాఁక దహించెన్. ౨౮

క. ఆయెడ దక్షిణదిగ్భవ, వాయుపదత్రియికి నెన్న వరుణాలయది
గ్వాయువు సపాదసప్తా, ధ్యాయి యనం దగు నటంచు నడును న్నుడువుల్. ౨౯

మ. ప్రతికూలుం డగుచంద్రుఁ గూడి విరహివ్రాతంబు నేఁచంగనో
యతిగాఢచ్ఛదశాఖితా వనుల ధ్వాంతారాతి డావంగనో
యతిశోషోగ్రత నవ్వసంతుపయిఁ దా నందెం జుమీ నాఁ బదా
హతి దహోష్మత లోకబాంధవుఁడియం దారూఢమై వర్తిలెన్. ౩౦

మ. సతవాహంబులు మచ్చరం బొదవఁగా సప్తాశ్వము న్వెంట న
వ్రతిమం బౌ రథమూన వంతిడఁగ నాభానంబు చే శీఘ్రపుం
గతి నయ్యశ్వము గాంచ రేమి జడిమం గాంచెం బ్రయాణంబు భా
పతికిన్ నా దివసంబు లాయతము లై పాటిల్లె నవ్వేసవిన్. ౩౧

సీ. నాఁడగు దాహగుణంబు కారణగుణప్రాప్తంబుగా జగత్ప్రాణుదాహ
సక్తిసంతతికి సంశయింపఁ బనేమి నీచుఁ డొక్కఁడు గంధనిలయుగోత్రి
మంది తద్ధర్మంబుఁ జెంది స్వధర్మంబు విడిచిన నేఁ బోవ విడుతు నెట్లు
జడత్వమైకొనుట నే జలములో మైత్రికిఁ జొరఁజిచ్చుహరియింతుశరధిఁజొచ్చి
యను మఁబళ్ళిముజలనిధి యందుమెలఁగు, భీకరాటోపబడబాగ్ని వెడలెనఁగ
నఖిలజనములు భీతి నిట్టూర్పు గాఁగఁ, బట్టుచాలక వడముటివెట్ట దోఁచె. ౩౨

క. పుడమి విరియంగఁ గొలుకుల, తడికోలఁకులతడులకోడఁ దరలఁగ జంతుల్
కడు బడలి నీళ్లగాళ్లం, బడిగొంతులుదడుప మందు(?)పడమరసాగెన్ ౩౩

సీ. బలిసెరు బహుదూరపదవి ప్రపలతోడ భూరిసరిన్మధ్యపులినవితతి
యెండసాగెను మార్గగేహితకూపంబు లమితపాంథాళికంఠములతోడ
దీర్ఘత గైకొనె దినములు మఱిమఱి యతిదృఢజలరజ్జుతతులతోడ
మించెను మిక్కిలి ప్రపలాంచదగ్నిశిఖాళి చటులదవానలచ్ఛటలతోడ
సంతతాన్నప్రదాతను సాధుకర్మ, శీలునకు నీళ్ళ వలసటు సేయువలసె
నతులపశువృద్ధి గలిగినయట్టివాని, కైన నర్థాంబు వబ్బుట యరిదియయ్యె ౩౪

గీ. కూటిపేదఱికంబు గైకొనిరి మిగుల, నాతరము చేత బ్రతికెడునట్టివారు
ఖనన మొనరించితనుయాత్ర గడుపువారు, కూలిగలుగుటనవ్వేళ గూటఁబడిరి ౩౫

గీ. తల్లి *పదమునందు ధార్మికమనముల, (సుకవి)కవితయందు సొబగుమిగులు
గుబ్బలాండ్ర పీనకుచమధ్యసీమల, నిలుచు శైత్య మనుచు నిలుచు బుద్ధి. ౩౬

క. కూటిసుచి పానమొందెను, బాటిల్లెను నీళ్ళసుళ్ళు పవనంబునకున్
మేటిసురతములకూరిమి, గాటపుటుపగూహనముఁ గదలక నిలిచెన్. ౩౭

గీ. చూడకయుఁ జూచికొన్నింటిపీడనాడి, యరసికొనుకకొన్ని కూపంబు లాఁగికొను
చుఁ, బురుషు లింతలు వేర్వేఱ బురదనీరు, కడవనెలితిగఁ గైకొనికడుబడలిరి. ౩౮

క. హారఘాలోద్ధతవహ్నియె, తిరుగం గ్రీష్మంగఁ బలఁచి దీపించె నటం
చురవడి వెట్టకు వెఱచుచు, మరుఁ డుసుకుఁగళిశిరదుర్గమధ్యముఁ జేరెన్. ౩౯

క. బలుబీఁటల వెంబడిఁ జనఁ, గల (జల)జంతువులు మొదటఁగల పదనంబెం
జెలువబలుగుబ్బ చలువల, నెలవుగఁ గైకొను మగంటు నేర్పున బ్రతికెన్. ౪౦

సీ. ఇనుఁడు దాక్షిణ్యంబు సెనసి మున్ లోకభాంధవుఁ డనఁదగి యనుద్ధతకరత్వ
మనువుగఁ దమకు జీవనసిద్ధి గావింపఁ దనులోపజంతుసంతతుల గోడ
ముదము గైకొనె నదీనదము లంతటఁ గాలగతిచేత నత్యుగ్రకరతఁ బూని
యతఁడు దాక్షిణ్యంబు గతిముగా దినదినంబును నాత్మదత్తజీవనము నెల్ల
గాఁకఁ గైకొన బంతుకోఁకటికి లేక, మలమలను మాఁడఁ బన్నతిగలయఁగ్రమ్మ
నందఱుల్లంఘనము సేయనమితపంక, భావమొదవంగ నెంతయుబయటఁబడియె. ౪౧

క. పట్టపగలెనయుభానుఁడు, బెట్టగు కాఁకల జగంబు బెదరింప హరుం
డట్టియెడఁ గాన సెకశ, ట్టప్పుడిగి మోజపెననెసుతలఁ పుదయించెన్. ౪౨

గీ. పవలధఃకృతరేభబావప్రచండ, ఘటనపటువృత్తి దీర్ఘ చటుల మగుచు
దివ్యతేజోగుణంబున దీప్తిగాంచి, సుకవికృతిరీతిఁ గనఁబడ్యెఁ జూపరులకు. ౪౩

క. పడమటిసెక నుదుకఁగఁ బడు, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాబుంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడు బూతం బనుచు వానిఁ గర్మారూపాల్. ౪౪

గీ. చిత్రచిత్రరుచివ్యాప్తిఁ జెంది యరస, భావనిత్యాస్పదం బని పలుకఁ దగుచు
భీకరనిదాఘసమయంబు పెంపుగొనియె, జరమకావ్యంబుగొన్న సౌష్ఠవముగాంచి. ౪౫

క. పంకరుహాజాండభాండము, పంకజహితతిగ్మకాంతి పటువహ్నిశిఖం
బొంకమున గాఁగుసపటిని, రంకశశధూమంబునం బరాగము వోడమెన్ ౪౬

*పదగునందు-పు.

సీ. భూరికవిరోచిఁ గాలెను పుడమి వేడఁద, పెనము పైఁబండు వెన్నెల పేరి యట్టు
వంటమీఱినయాఁకటమఱియుమఱియుఁబొట్టనిండించె రేఱేనిపులుఁగుఁదుటుము
చ. ఖరకరరుక్ప్రతప్తదృషత్కంజభవాండఘటాంతరంబునం
గరము మెలంగి క్రాఁగునుసుకాంతివిభామృతముం జకోరముల్
పరఁగు(గుటా)గుటార్భటులఁ బానముచేసెను నోరు పొక్కఁగాఁ
బర మనురక్తిమై మిగులఁ బాటిలుదప్పికి వేఁడి వాఁడియై ౭౮
సీ. అతులమాధుర్యమకలంకమనుచు విబుధ, సముదయంబెన్న జగతిఁబ్రశస్తిగాంచు
నక్కళాభృదుదంచద్వామృతంబు, గ్రోలిసుఖియించెఁజాలఁజకోరసు*కవిరసా
క చిచ్చునకి పగటికాఁకల,నిచ్చున్ జక్కవలు సుఖితనిలిచెను గాఁకల్
హెచ్చెను వెన్నెల వానికి, మచ్చికజనరాండ్రు రేల†మఱుగునఁ బడుటన్ ౮౦
చ. తొలుత హిమాంశుమంజురుచితోయమహాప్తకరప్రతిప్తతన్
సొలఁగెను చంద్రికాంతములు మీఁదటఁ బర్వు ఛటచ్ఛటార్భటీ
మిళితప్రవాహపుల్ దిశల మించెను బిమ్మట రాలు మెత్తనై
నిలిచె ద్రవంబుజాలు బలునిర్ఝరముల్ గలిగెం గ్రమంబునన్. ౮౧
గీ. చంద్రుఁడయ్యెనుదవనుండు చక్రవాక, దంపతులకెల్లనవ్వేళఁ దవనుఁడయ్యెఁ
జందమామయుఁదలఁపనీ చందమరుదె, యోగతిదభావ హేతువులూర్జితముగ. ౮౨
క. భోగులకు రాత్రివేళల, బాగుగ రుచియించె మధురపానకరసముల్
బాగై రుచించె నంతకు, బాగా నిజసతులమోవిపానకరసముల్. ౮౩
ఉ. శ్రీవిరాత్రులందు నరవిందరిపూవలవారి నిర్ఝరో
ల్లాసముఁజేసె బ్రోషితవిలాసినధూ ‡రుదితోత్థబాష్పముల్
గాసిగ వీచుచుట్టి బలుకాఁకల వారుణదేశవాయువుల్
భాసిలఁజేసెఁజాలఁ దదపారముఖోదితతిగ్మవాతముల్, ౮౪
క. వ్యాకోచమల్లికాకిసు, మాకృతు లవ్వేళఁ గాననయ్యెను జంద్రా
లోకపరిలీన మగుచున్, వ్యాకీర్ణోదీర్ణపరిమళాంచితమహిమన్. ౮౫

—♦ వర్షఋతువర్ణనము ♦—

సీ అమితభూతాపవినివారణాశ్రయంబు, భువనసస్యానుసంతతస్ఫూర్తిబీజ
మూర్తచాతకసంజీవనౌషధంబు, నంతఁగృష్ణాభ్రము ప్రకాశ మధిగమించె ౮౬
క. తనబలుజీవనధనములు,గొని జగములనేఁచు గ్రీష్మభూరాసురునిం
దునుమాడ నెత్తె వరుణుఁడు ధను వన నపరాశ నింద్రధను వుదయించెన్. ౮౭

*కవిశబ్దము పక్షిపర్యాయముగా వాడుచున్నాఁడు †మరదలిపడుచున్ మూ. ‡గదపాద బాష్పమూ

సీ. చంచలాటోపవైశ్వానరశిఖ లొప్పఁ జిత్రభానుస్థితాస్ఫూర్తి లెనయ
మేదురగర్జానినాదంబు లెసఁగంగఁ గరకామహోపలగతులు మిగుల
నాశుగోద్ధతవృష్టు లవిరళంబులుగాఁగ హరిగోపసంభృతాపాద్యు లడర
వాహిను లెంతేని వడి మించి నిగుడంగ నళసఘోరాస్త్రవిహార మెనయ
నలమయూరాదికవివరు లతిముదమున, ఘనతరస్తుతులొనరింపఁగాఘనుండు
అఖిలసంతాపకారి గ్రీష్మాపకారి,కడక మాయించెనర్వోపకారియగుచు ౫౮

క. * వార్షికమహాభ్రపటలా, కర్షణపటుమంత్రవిద్య ఖరఖరఖరతా
ధర్షణకారణ మగు శ్రే, ఖర్షభదిగ్వాయు వపుడు కడు దీపించెన్. ౫౯

చ. పవమటిగాలి దా జగముపాలిణము నుగ్రకరుండు గాంచునే
వెడఁ గగులోకభాంధవత వేదనసేయు నటంచు రోయుచుం
గడు నల(రె)న్ బలారిదెసగాడ్పు వదాన్యఘనుండు దోఁచుతన్
నడువ జగంబుపాలిణ మనునామము లోకములో విరాజిలన్. ౬౦

క. జలధిం జుళుకంబునఁ గొను, బలుసేర్పరి కుంభయోనిఁ బ్రార్థింపుమఁ ద
జ్జలముగొను † నేర్పు గన నన,జలదంబులు జమునతోడుచాయకనడచెన్ ౬౧

గీ. పగలు రేయి దివాకరుఁ బన్నగేంద్రుఁ, జూడవి పీక్షింపఁ గను విరహిదళనంబ
నేమమునఁ జేయఁబూనుచు నెగడెమింట,విపులతరమైన(యాకృష్ణ)విషధరంబు ౬౨

క. ధారాధరగళదుమరస, ధారానిర్గరమునందుఁ దత్త్వజ్ఞులకున్
దూరించెను సమవిషమా, కారజ్ఞానములు రూపకం బొక్కటిగాన్. ౬౩

క. స్థలజలభేదము మానఁగ జలదము వర్షం బహర్నిశంబుఘటించెన్
విలసల్లక్షణవృత్తికి, బలుశాబ్దికు లాక్షవృత్తి పరిభసేయంగన్. ౬౪

ఉ. అందముగాంచు నెట్టిజవరాండ్రను బెండిలియాడుచో నుదిం
జెందు కలంకతో వడిగఁ జేరు సరిద్వంతివధూటుల స్నిజా
మందతరంగహస్తముల మించి నెదుర్కొని కౌఁగిలింపుచున్
డెందములోని యక్కలఁక దీర్చును దక్షిణవార్ధి నిత్యమున్. ౬౫

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానరరక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రిభోజనం బెద్బట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
సారమంత్రపాస్తిచతురుల కశనంబు వార్తగల్గుట గాని వారియయ్యెఁ
బరిత్గృహంబున కేగి ప్రార్థింప(బ్రార్థింప)శిఖయొకింతొసఁగినఁ జిత్రమయ్యె

* వర్గుత—మూ. †నొప్పగనళన—మూ.

జంబుగూడలకలుషములు డంబుమిగిలెఁ, గలికసంపాదసంబులు ఘనతగాంచె
నన్నదాను సేవియు వతిథికోకని, కైన సన్నంబు గల దను టరిది యయ్యె.

మ. చటులోద్వృద్ధసగర్జితధ్వనులు చంచచ్చంచలాసోచులు
ద్భటవృష్టిన్ ఘటియిల్ల భీతి మదిఁదోఁపఁగా భీరురంభోరువుల్
పటుమానంబులు మాని తమ్ము బలుగుబ్బల్ గాఢసంఘర్షఁ జ
ప్పటలౌనట్లుగఁ గౌఁగిలింప రమణుల్ ప్రాపింతు రానందమున్. ౧౮

సీ. భూపరిజాసంతాపభూరివైశ్వానరజ్వాలతో దావాగ్నికీల యడఁగె
సూర్జితమేఘగర్జితార్భటులతోఁ గంపకీసంపదల్ గ్రమ్ముకొనియె
నవిరళఘనాంకురాదూర్వపు ములతో గోత్రీగరుచులు పొంగులువహించెఁ
గర్షకపాదజాఖండమోదంబుతోఁ గాస్వరామోదంబు వాసిగాంచె
జాతికుసుమప్రజపరిమళభాతి కేకి, జాతికేకారవంబుతోఁ జాలనెగడెఁ
జాతకవారితమదతమిస్రములతోడఁ, గలయదిక్కులఁగటికిచీఁకటులుబలిసె. ౧౯

గీ. దినదినంబును శుచికాత్మతేజ మిచ్చి, మగుడఁగైకొన నేఁతనిమాననేమొ
తరణికిరణంబులన్నియుఁబరఁగనేమొ ఘనములగుచునుగాకున్న పినునిగనరెట్లు.

చ. జలధిమథింపఁగాఁ బొడమెఁ జంద్రమయుం బను నుష్ణముష్ణ దా
బలుఘనమండలంబు వడిఁబర్వఁగఁ జేయు మహాంబుధారలోఁ
గలియుచు నీరమయ్యె నని గట్టిగఁదోఁచెను బుద్ధికానిచో
జలమహావైరి నత్తఱిఁ బ్రజల్ గనరేల యొకప్పు డేనియున్. ౨౦

క. నిష్టపులలోన నాదిమ, నిర్జరుఁ డగునీటిమాలి నిరతస్ఫూర్తా
త్మోర్జితవృష్టి న(వి)గ్జర, తార్జితమున్నీర్తియయ్యె నని వ్రజ నుడువున్. ౨౧

గీ. ఆటవెలఁది యనఁగ నమరెను దద్వృష్టి, యురుపయోధరత్వమిరవుకొనుచు
శ్యామభావ మొదవ సంతతమన్మథ, వికృతిమహిమకెల్ల విత్తనంగ. ౨౨

గీ. ఉరుతరంబగువృష్టిసూర్యోదయాస్త
మయములెంతేనిసందిగ్ధమయిన యపుడు
సోమపుల కగ్నిఁ బ్రీణయించు నోట నొగవు
నసమయాయత్తసప్రవృత్తియహరహంబు. ౨౩

గీ. అఖిల మమ్మయ మగునట్టు లాచరించి,వంద్యులుంగు విలాసంబుమునుచితాన
యవ్యాప్తియతఁగైకొని యభ్రపటల, మాదిమబ్రహ్మ మన విస్మయంబొసఁగె. ౨౪

క. భూరిప్రసాదమధురిమ, ధారాగుంభ(ము)లు సంతతస్ఫురదోజ
స్సారముల నభ్రమండలి, గారించు న్నవరసప్రకారపుఁ గవికిన్. ౨౫

ఉ. జీవనమున్ హరించి యును, జెల్వుని దాపియు, జన్నకోటికిం
గేవలహానిఁ జేసియును, గేరు నినుం డరుగన్ ఘనుండు గా
జీవనవృద్ధి గైకొనుచుఁ జెల్వుని గూడును జన్యసంతతుల్
శ్రీవి వహింప రాజిలు పటిష్ఠత గాంచె నదీవిలాసినుల్. ౨౬

గీ. పటుఘనాఘనమండలి ప్రసరదసమ
వర్షధారానిరస్తసంజ్వరత గాంచఁ
జాతకుఁ(డు)సద్గుణముఁ జెందు జగమునందు
విషమభావంబు గైకొను విస్ఫుటముగ. ౨౭

క. నవరసబంధుర మేరియు, నవిరళకర్ణాతికటుక వాన్విత మయ్యెన్
*అవగతరసావకర్షం, బవునే యుత్సృష్టరసమహత్త్వంబు మొగుల్. ౨౮

క. ఘనమండలి యత్యున్నతి, గనుఁ†దొల్తం బిదపఁ గరకకలితకుసుమజా
లనవజలసేకములఁ దా, మొనయుంపుడు నీలకంఠముద మొనరించున్. ౨౯

చ. సరసఘనానుషంగమున సంతతతాపము మాని భూమి దు
ర్భరతరపంకమగ్నతనుఁ బాల్పడియె బకింప నద్ది యే
కరము నిదానమౌ జగదఖండసుఖంబున కాదిమూలమై
పరఁగు నపారసాధుఫలభారసమృద్ధికిఁ జిత్రమెంతయున్. ౩౦

చ. పడమటి వెట్టచేఁ గను పభంగుర వేదన గాంచఁ జూచి తాఁ
జిరిముడి(పా)టుమై నిమురఁ జెందక నందకపాణి యవ్వడా
కడుసెకపే రడంగఁ దనకాన్పు సుఖాపఁగ రెండుకన్నులున్
బడలిక దీఱ చెల్వగొన వారిధిఁ గూర్చు ఫణీంద్రశయ్యపై. ౩౧

క. ఉరుగర్జితవాద్యధ్వని, సురుచిరకేకానినాదశుభ(గీ)తంబుం
దరుణమయూరీనృత్యము, పరఁగన్నాట్యంబు మిగుల భాసిలుచుండున్. ౩౨

గీ. ఘనతగర్జ జగద్రతుకత జడత్వ
మార్ద్రిత ఘటిల్లెఁ గావున నచట భత్వ
ముత్వపరమా‡టుచితమన్న యొఱపు మీఱఁ
బాదలి వర్షాభువులు చాల రొదలు సేయు. ౩౩

సీ. నిర్ఘాతగర్జితనిరుపమకోపప్రసాదవిహస్మితలు చాలఁ దొలుక
విద్యున్నటీలాస్యవిలసనంబులు మీఱ నాసారకారుణ్య మతిశయిల్లఁ

*అవితరసావకర్షం-మూ. †దొల్త టిపిదప-మూ. ‡సుచిత్రకన్న యొఱపు-మూ.

జాతకబర్హిణచతురార్థు లలరంగ జాతు లాతోవవిస్తార మెనయ
ఫలహేతుధర్మసంభరణశక్తి చెలంగ సంతాపవార్తలు శాంతిఁగొనఁగ
రాజహంసవిలాసంబు రాణదొలఁగ, సముదవర్తిల్లు చున్నతస్థాన మెనసి
ధరణిపాలించె ఘనుఁడుచిత్రంబుగాఁగఁ, బాక మొక్కటి యెక్కువైపరఁగెఁగాని.

గీ. మానకృతమైనవిరహంబుఁ బూనన య్యెఁ, దరళనయనల కవ్వేళ ధరణిలోన
ఘనకసంపాదితద్రవ్యగౌరవంబు, సాధికరణంబు కర్ణధారాళి నయ్యె. ౮౫

క. కట్టువడె నేటికాల్వడ, బెట్టగువర్షములఁ గొనెను బేరముతోడన్
మిట్టమిట్టాటుపల్లెలు, గట్టిగ మొనచూపసాగెఁ గట్టులతోడన్. ౮౬

ఉ. కాలువలెల్ల బల్వదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గేలి యొనర్పఁగాఁగడఁగెఁ గేవలమబ్ధి నతండు నీరమూ
ర్త్యాలయుఁడైనఁ దావిక్రృతినందక యుండు వికారహేతువుల్
చాలమెలంగినన్ విక్రృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౮౭

— శరదృతువర్ణనము —

క. తరువాత శరత్సమయం, బరుదుగ ఘటియిల్లె నంబుజాక్షుస్వాపా
వరనామకబహిరంగము, హరియింపఁగఁజాలు నంతరంగం బనఁగన్. ౮౮

గీ. వారివాహారసారంగవర్ధమాన, బహునదీపంకబాహుళ్యపాటనక్రి
యాతిదక్షిణనామనామాభిరాము, మై శరత్కాల మామోదముల రనమరె. ౮౯

సీ. కాలవశాగతఘననీలతాస్థాయిభావభిన్నాదేశభద్రమూర్తి
సర్వసరిన్నీరసంపదచ్ఛతాద్విత్యావాల్మీకిదివ్యసూక్తి(?)
రుచిరకేకివచోవిరుద్ధధిక్క్రద్దోషసమసభినైష్కసంశ్రయంబు(?)
సరసిజాహితబింబసత్కావ్యశోభాతిశయహేతుహితపరిష్కారమహిమ
మూర్జితహరిప్రబోధగురూపదేశ, మఖిలహంసగణాకర్షణాఢ్యమంత్ర
మంబుజాతప్రభావ్యంజితాంజనంబు, దనరె నెంతయు శరదభిధానఋతువు.

క. సరసతకల్మిఁ బ్రసాద, స్ఫురణంబున నదులు మెలఁగఁ జోద్యంబగునే
విరసితభావము నందియు, నరుదారఁ బ్రసన్నభావ మందె నరుదుగణా. ౯౧

క. కలుషతఁ గడపెను శరదృతు, వొలయఁగ సుఖపారవశ్యమొదువ న్నదికాం
తలపులినకటితటంబుల, నలరారఁగఁ బూని రమలహంసకగణముల్. ౯౨

గీ. అలకళాధగు నలరించి యవనిపంక, పటిమ వారించి యుద్యోగిబంధ మెడపి
శరము విడువక యాశరత్సమయ మెనయు, నేటిబోటులకలుషతమీఱెముజియు,

క. ఆతతి నంతయు విమలం, బై తనరెఁ బ్రోషితాంగనాంబర మొకఁడున్
శ్రీతరుణితోడుమై వి, ఖ్యాతిన్ వర్తిల్లునొక్కయుంకము గాదగన్. ౯౪

క. జీవన మంతయు లోకో, జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి వడసి మై
కేవలపలితంబుగఁ దా, బోవదె ఘనపాళి యతిపుంగవుదిశకున్. ౯౫

మ. పటుసంరంభవిలాస మొప్పఁగ జగత్ప్రాణుండు ప్రేరేప ను
త్కటగర్జాకృతశోక్తు లుప్పతిల లోకత్రాణకై జీవనం
బటు వోవైచి యసారుఁడై ఘనజనం డాహా వెలంబోయి దా
నటునిట్టున్ భ్రమియించు లబ్ధులకు సౌఖ్యం బబ్బునే స్వాస్యతిన్. ౯౬

క. రాజధనుస్సులు నిర్జర, రాజధనుస్సుల మెలంగు*రాణాంభోధ
శ్రీజనచంచలహ్రాదమునఁ, భోజంబుల నీటికలఁక పూని వసించెన్. ౯౭

చ. నెలయనుమోము లక్ష్మనను సిద్ధపుఁగస్తురిబొట్టుఁ జెంద ని
స్తులఘనకేశపాశము ప్రసూనవిభాసిత మై మెలంగఁగా
విలసదనూనతారకలవింతరుచుల్ దిశలం జెలంగఁగా
వెలయుచు నభ్రలక్ష్మి యతివేల మొనర్చు ముదంబు చూడ్కికిన్. ౯౮

గీ. మధురరసము ప్రసన్నత మూన కూని
మధ్యవృత్తులుగొనుచు నిమ్నగలు కృతుల
చెలువు గైకొని మోదంబు సేయుఁ బూని
ఘనముగఁ బత్త్రపక్షంబు గలుగునేని. ౯౯




గీ. నీరసం బాచు జాడ్యైకదూర మగుచు
సుప్రసన్నత గైకొని దీప్రవిష్ణు
పదమునందు మెలంగునప్పటిజలదము
పుణ్యపురుషునిభావంబు పొందు గొనియె. ౧౦౦

క. నెల ధీరలలితుఁ డయ్యెడు, నలనిర్జరపదవి రంగ మనదగుఁ దచ్ఛ్వే
వెలుఁగునటియగును దారలు, లలితతదంజలివినిస్సరన్మృదుసుమముల్. ౧౦౧

గీ. లలితమైతోఁచునట్టి కళాపదంబు, వింతయైతోఁచు† నేల యమాంతమైనఁ
దలఁపఁ జిత్రంబుగాదె ద్రుతప్రకృతికి, నపగమైయుద్ది మిక్కిలి వెలయుచున్న.

క. మధురరససాధకంబై, యధిరాజమహారణక్రియాబోధకమై
యధిగతరససంకరవా, క్ప్రథిమం గొని యాశరత్తు ప్రౌఢిమ మెఱసెన్. ౧౦౩

క. ప్రకటితకాశాకాశా, వికలసవర్ణత శరత్తు విదితం బయ్యెన్
వికృతికిఁ బ్రకృతిత్వము గొని, ప్రకృతికి వికృతిత్వ మొందు భావన్నగుచున్

* రాణగొనుంబాం । ధారాచంచల - మూ† నె రమాంతమైన-మూ.

## — హేమంతఋతువర్ణనము —

క. సర్వజగద్విజ్ఞానా, ఖర్వవిధానాబ్జమిత్రఘనరుచివిద్యా
సర్వస్వహృత్యవిద్యా, ధూర్వహమై మించుమంచు దూకొనె బిదరన్. ౧౦౫

ఉ. తమ్ములదాయ మేల్గనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచు బి
చ్చ మ్మరియాదమీఱ వడిఁ జొన్పఁగఁ దమ్ములతోడ నాత్మ స
ఖ్యమ్ము ధరించు కల్వలును గాఱియఁ జెందెను మిత్రవర్గఘా
తమ్ము నెఱుంగఁడయ్యె నుచితస్థితిఁ గాంచ జడుండు నేర్చునే. ౧౦౬

క. అహతాకారతఁ *గైకొనె, మిహికాసమయంబునందు మిగుల నెగడుచున్
మిహికాసముదయ మంతట, రహి†సంస్మృతియనఁగ‡వింత వ్రాయఁగనగునే.

ఉ. నింగికిముట్టి తోడుతన నీటుతొలంచెడు వింధ్యశైలముం
జెంగఁగఁ జేయ మంచుమల చిత్రముగా వడి రోదసుల్ గడుం
బొంగుచుఁ గ్రమ్మెనో యనెడుబుద్ధి జగంబుల కావహిల్లఁగా
భంగము లేక యెల్లెడలఁ బర్వె హిమాని నిరంతరంబుగాన్. ౧౦౭

క. మంచు గిరితరుల ముంచఁగ, వంచకభిల్లుండు వెదకు వలిమలతేరన్
ఎంచుకొనఁగడఁగి రమరు లుదంచితనిజనిలయనివసదామరతరులన్. ౧౦౮

క. ఆరూఢహిమ మడంపఁగ, నేరుపు గానఁడయ్యె నినుఁడు నెఱిఁ బగటను నీ
'హారమివభాస్కర ఇతి', స్మారోపమ యొనర మిగుల జతనంపడియెన్.

క. పదవర్ణస్ఫోటంబులు, గదియింపుచు ముఖపదముల ఘటియించఁ గడుం
బదిలముగ ధ్వనులు శాబ్దిక, భిదురధరస్ఫూర్తి హిమము పెంపుమిగులఁగన్.

గీ. ముఖపదోచ్చయమున ధ్వనుల్ మొనయఁజేయఁ
జాల నెనయించు రూపకమీలనముల
హిమకవి యొనర్చుదృష్టాంతకములగరిమ
సమజగత్కృతియధరప్రణములుగాని. ౧౧౨

## — శిశిరఋతువర్ణనము. —

గీ. దాసిపిమ్మట మార్తాండభానుచండ, భావసంస్తంభనోమధప్రాభవంబు
సంగతహసంతికాదృఢాలింగనైక, ఘటనచేటంబు నగుశీతకాల మొదవె.

చ. చలి యిడువేదనం బడఁగఁజాలక పద్మజశౌరిశంకరుల్
మొలఁతల నాననాబ్జమున మించునురంబున సామిమేనున

---

*కైకొని- †సంవ్యాప్తి-‡వింతరాయనదగునే మూ-

న్నిలుపుమ నవ్వేతం గడవ నేటికిఁ బాయరు తత్ప్రదేశముల్
జెలువలు గారవం బరుగఁ జేయఁగ న*ద్దశకోర్వ నేర్తురే. ౧౧౮
గీ. అగ్నిదివసాంతసమయవివ్యస్తమిహిర, పటుమహఃపూరసంపూర్ణబలుఁడుగాన
సంతతాత్మీయకేవలసన్నిధాన, కలన శీతంబు వారించుఁగా రొకింత.
ఉ. శీతముచేత బాధపడు చిత్రజగంబు భరింపఁగా జగ
త్ప్రీత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురి నేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిదు
న్మీతము చేసెఁ గావలయు నమ్మి ఘటిల్ల హరించు శీతమున్. ౧౧౯
క. కాంతభృశాలింగితధృఢ, కాంతాకుచకుంభమధ్యగతసూక్ష్మబిలాం
భ్యంతరము గని యనంగత, కెంతయు నలరుచును మదనుఁ డెడ యుంజలికిన్
చ. అరమెయినుండు నద్రిసుత యందపుఁగౌఁగిలి లేక చిచ్చు క
న్నర కడు శీతలింపఁ జెలి కడ్డము సేసెను గరనాళకు
ర్భరగరవహ్ని మంచుమలరాయనియల్లుఁడు దేటచందమా
మరసిగలో విషాతిఖరమా బలుకుండలి లోఁగఁగట్టుచున్. ౧౨౦
క. †చలికిన్లోఁగకఁ నిలిచిరి, వలివెలుఁగులు వెదలుచల్లువాఁ డొక్కరుఁడున్
విలసత్కాలాగరువా, వలిగుబ్బల నండగొన్నవాఁ డొక్కరుఁడున్. ౧౨౧
క. అప్పప్ప యేరికైనఁ, జెప్పంగా శక్యమానె శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యాన్యోన్యసదృశతను ఘటియించున్.
గీ. మూర్తికౌటిల్య మంతేసి మొనయఁ జేయు, నధరశబ్దప్రచారంబులఁ సరఁ జేయు
శీతలరసాతిదూరతఁ జెందఁ జేయు, శిశిరకాలంబు దలఁప విచిత్ర మయ్యె.
శా. ఈరీతిన్ ఋతువుల్ విరాజిలఁగ నయ్యేణాక్షి పద్మేక్షణా
కారధ్యానరసానుభూతి ఘటితాఖండప్రమోదప్రవా
హారజ్యన్నిజవృత్తియై మహృదయం బన్యక్రియాజ్ఞానమా
ర్గ్యారూఢం బయి యొప్ప నక్కజపునిష్ఠం బూని యుండెంగడున్. ౧౨౨
క. జగదండమండనోజ్జ్వల, భగవత్పదవాచ్యనామ ప్రణమజ్జనతా
సుగమ నిగమాంతమానస, ఖగరాజారవితనూజకల్పమహీజా. ౧౨౩
గద్య ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపోత్కలితకలాకౌశలసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధి రాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టా
రక అహోబలపత్యాహ్వాయకవి మహోపాధ్యాయభట్టారక ప్రణీతంబై
న కాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

*నద్దెస-మూ. †చలికిలోఁబడక నిలిచిరి- మూ.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

— పంచమాశ్వాసము. —

---

క. శ్రీపార్వతీసతీపతి, చాపవిలోపనపటిష్ఠ జలదాభలస
ద్రూపక జగత్ప్రదీపక, భూపకవరసార్వభౌమ పురుషలలామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

— కృష్ణుఁడు ధర్మరాజుం జూడఁబోవుట —

చ. జగములఁ బ్రోవఁగా మనుజజన్మముఁ జెందు పురాణపూరుషుం
డగణితభక్తి సత్యకసుతాదికయాదవు లంటికొల్వఁగాఁ
దగిలినప్రేమచేఁ దరలెఁ దన్మొకపెన్నిధిగాఁగ నెప్పుడున్
మిగిలెడుభక్తిచేఁ దలఁచుమేటి యమాత్మజు సానుజుం గనన్. ౩

క. ఇంద్రారివైరి చనుచు మ, హేంద్రప్రస్థంబుచూచె నింద్రమహీభూ
సాంద్రసుమవిసరవిగళిద, తంద్రమరందైకపూరితస్ఫుటసరసిన్. ౪

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు, సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు, వ్యత్యయకారోప్యపపత్యనుగత
మనుస్మృతభవికలాపాయోగసిద్ధంబు, రేఫోపహతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణసిరూఢంబు, సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు చష్టభాషావిశేష, సముదయుస్ఫూర్తి హాసియింపఁ జాలునట్టి
పురవరంబు హరి ప్రస్థపుణ్యనామ,మచ్యుతానందమునఁగాంచె నచ్యుతుండు.

గీ. అపుడు శ్రుతులకు నెప్పుడు నబ్బఁబోని
యసమబాణమహావీరునబ్బగాని
సవిధసంప్రాప్తి యతిథివైభవము గాంచె
సుభగమహిమంపునమవర్తిసుతుశ్రుతులకు. ౫

గీ. వెన్నునాగమనంబుఁ దా విన్నయపుడ,ధర్మతనయుఁ డొకర్థొఁ దరలఁబనిచె
ఘనతరానంద మగుతనమనసుతోడ, వాసవసుతాదిహితుల సేనాసహితుల.

ఉ. కూరిమిమీఱఁ దన్నెదురుకోఁ బవనాత్మజు నాత్మవత్సుమం
జేరిసుఖించుఁ పుణ్యములఁ జేరిచి నమ్రసజోత్తమాంగుఁ డ్

ధీకుల నింద్రనందనుని దేవభిషక్తనుజన్ముల౯ శుభా
ధారవచస్సుధం జిలికి ధన్యులఁ జేయుచు నేగి యంతటన్. ౮

మ. ఒకచో మాధురిఁ గుల్కు పల్కుగములం బొంపారఁగ వేజోక్తిచోఁ
బ్రకటప్రౌఢవచోనిగుంభనలఁ దీవ్రస్ఫూర్తి వర్తిల్ల నే
కకదోషంబును లేక కావ్యమణి శోకం గాంచు నాస్థానిలో
వికచన్యాయికరత్నమై యనురుహృద్వీకాంతు నీక్షింపుమా. ౯

చ. నతు లొనరించుపుణ్యులకు శాశ్వతసౌఖ్యనిధానదక్షమౌ
గతి ఘటియించునప్పరమకారణతత్త్వము ధర్మమూర్తికి
న్నతి యొనరించెఁ బ్రాక్స్వజనినమ్రత సంప్రతి తన్నిరంతరో
న్నతి కగుఁ గారణంబని జనప్రకరంబు నుతుల్ ఘటింపఁగన్. ౧౦

క. చాఁగిలి మ్రొక్కిన యప్పుర, యోగీశ్వరు గ్రుచ్చి యెత్తి యోగీశహృదా
భోగసమనిజభుజాంతర, యోగింగా ధర్మతనయుఁ డొనరించెఁ గడున్. ౧౧

మ. అలవేదాంతసరస్వతీసముపగూహాం బేర్గైకొని య
బ్బలుతేజంబు తనంతఁ దానె నిజదోర్బంధంబు నోఁజిక్క ను
త్కలితానందపయోధిఁ దేలుచు నజాతద్వేషి సన్ముఖపు
ణ్యులు లేరంచు మదిన్ గణింపుము వరేణ్యుల్ శౌరిఁ బల్కెం దగన్. ౧౨

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీకుపదభక్తి చేకొని నిలిచినాఁడ, నితఁడు నెఱుఁగఁగద యిట నీవె సాక్షి.

ఉ. అట్టిఁడివాఁడ నే నెటుల నంతటివాని కవాప్తకాముఁడన్
గట్టిగఁ గొన్న నీకు శుభకల్పనసేసెద మారకుండఁగాఁ
గిట్టను గాన నాదికవిఁ(?)గేరెద కృష్ణుఁ బద్రుంది శిష్టు న్
దిట్టముగాఁగఁ బ్రోచికొనుదేవర వై జగమేలు మంచొగిన్. ౧౪

ఉ. లెక్కకు మిక్కుజన్మముల లేఁతకుఁ దక్కిన భక్తి నే నతుల్
మిక్కిలి నీకొనర్చితి సమిద్ధగుణాకర తత్ఫలంబులై
దక్కెను *నాయనమ్రతయుఁ బావకనమ్రతయున్ సమానులన్
నిక్కము ధిక్కరించితిని నిస్తులపుణ్యయశస్సమృద్ధులన్. ౧౫

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుప
నీవకా కన్యదేవత నేర్పుఁ గనదు
దురితసంహార జగతి ఖద్యోతుమహిమ
యొనరు నేరీతిఁ దలఁప ఖద్యోతమునకు. ౧౬

---

* శాధనమ్రత యను—పా.

వ. ఇట్లుచితాశీర్వచనరచనాపురస్సరనిరస్సర ద్విపేతపూర్ణామృతంబుల శ్రే
వఃకూపంబులు పూరించుచు నుదంచితరోమాంచకంచుకితసర్వాంగుండై
సర్వమంగళాయతననిజాంగసంగసంగతాభంగురసుఖం బెట్టకేలకు నడలి
యమునతోఁబుట్టువు గారాబుంబట్టి వేల్పుఱాకట్టు దిట్టంపుటాసనంబు వె
ట్టింప నం దధివసించి బ్రహ్మాండభాండకజంబూద్వీపభూపాలపురహారిప్రస్థ
న్నిలయతత్సభాతత్సింహాసనాశ్రయోత్తరోత్తరోత్కర్షనిష్కర్షతత్పరు లగు
తత్రత్యకవులవాక్ప్రసారంబులు ససారంబులై వెలయ నుత్తరోత్తరసూక్తు
లం దత్కృతప్రశ్నప్రయత్నంబు సఫలంబుగా ననుగ్రహించి సహభోజన
సహశయ్యాసహాసనసహసంభాషణాదిక్రియల యమునాత్మజు సానుజుం గృ
తార్థుం గావించె నిట్లు కతిపయదివసంబులు గడువ నంతట నొక్క దివసంబు
న దివసేశ్వరునిమనుమనియనుమతంబున మృగయావిహారవిలాసనమాలింగి
తాంతఃకరణుండై సత్యభామారమణుండు సత్యకాపత్యప్రముఖయాదవ
వీరులు చేరికొల్వ బలారినందనుం డనుసరింప గుణవృద్ధిసమాశ్రయత్వం
బున నాదేశవిషయతనిష్ప్రత్యాహారవర్ణసవర్ణత మెఱయు శూరాగ్రసరు
లగ్రసరులై ననుదేర సమానశబ్దప్రతిషేధనిష్ఠాధారత "నిష్ఠాసంజ్ఞాయాం
సమానశబ్దప్రతిషేధ" ఇతివార్తికోక్తి ననుసరింపుచుఁ దద్గుణవిషయతం గృ
తసర్వాదినిపాతసతవహించుట సర్వప్రాతిపదకంబు నపహసింపుచు(?) ద్వితీ
యవక్రతమ ద్వితీయక కవర్గచతుర్థవర్ణప్రతిపాదితనాదమేదురీకృత రోదసీ
కుహరంబు లగుకౌలేయకతల్లజంబులు మదికి నుల్లాసంబుగా వెన్నాడ వా
గురజాలప్రముఖప్రధానసాధనసామగ్రీసమగ్రు లగు నగణితమృగయాప్ర
కాండు లండ గొన నామలింగానుశాసనంబుకైవడి సింహాదివర్గ సంమిళి
తంబై మహారాజాస్థానపగిది నానావిధకవిప్రౌఢోక్తిసంకులంబై ప్రాకృతం
బుకైవడి వల్మీకభవనిదానంబై తర్కంబుచెన్నున నతికర్కశప్రమేయంబై
ఛందంబుభాతి మత్తేభశార్దూలవిక్రీడితలక్షణలక్షితంబై భరతంబురీతి సిం
హవిక్రీడితహరిణప్లుతకరిహస్తప్రసర్పితాకలితంబై యుత్తమకావ్యంబువడు
వున నవాచ్యమహిమంబై యలంకారంబు తెఱంగున ననువిషమవిన్యా
సంబై మీమాంసకవిధంబున నానాగమప్రభూతశాఖావైఖరీప్రకాశంబై
పాణినీయంబుననువున వృద్ధాంగగోత్రాశ్రితంబై త్రిలింగభాషానుశాసనం

బు చెలువున నున్నిద్రప్రాణికంబై యత్యద్భుతం బగు నొక్క కాళిందీతీరకాంతా
రంబు ప్రవేశించి. ౧౭

—శ్రీకృష్ణుఁడు వేఁట సలుపుట—

క. నలుదెసలఁ గాపు లునిచెన్, బలియుల మృగయులను వీరబలశాసనుఁడా
జలజాతపత్రనయనుఁడు, బలశాసనతనయుఁ బనిచి పటువేగమునన్. ౧౮

గీ. అతులచాతుర్య మొదవంగ నమ్మహాత్ముఁ
డమర ఘటియించె నపుడు పూర్వాదులందు
సంభవత్తత్త్వమయసంజ్ఞ*సరగఁ జేసి
సకలవిబుధులు వినుతింప సద్వ్య(వ)స్థ. ౧౯

క. దిక్కులఁ గ్రమ్మి భటుల్ రౌద్రాక్షమ్మునఁ జేయ మృగము లురవడి బెగడన్
మిక్కుటపుసువిరాక్షులఁ, బెక్కండ్రనిసితకవులు బెదరెడుమాడ్కిన్. ౨౦

క. జలజాక్షునుఁడి తమ్ములు, బలుమృగముల వెదకి వెదకి పడఁజేసిరి దో
ర్బల మలర శాబ్దికోత్తము, లలయపశబ్దముల నెనుకి హరియించుక్రియన్.

గీ. అలసనత్త్వంబులనసత్త్వములఁ గ్రియా†ప
రాశయముల స్వరాదుల నవ్యయములఁ
దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంత
సంగ్రహాయత్తమతి యైనసాధుమౌళి. ౨౨

గీ మాన్యుఁ డైనట్టి యాధ్వనిమార్గవేది, లక్ష్యమూలం పుధ్వని నవలంబనంబు
చేసి హరియించె మిక్కిలి వాసిగాంచు, తనకృతిత్వము మర్మవేత్తలునుతింప.

క. కరమరుదు కృష్ణమేఘం, బురుతరశరవర్షవైభవోదగ్రముగా
ఖరవైశ్వానరకీలలు, విరళతలే కన్నియెడల వేకననయ్యెన్. ౨౪

గీ. అవ్యయప్రకాశ మ‡విభక్తికోజ్జ్వలం, బగళితోరుసత్త్వ మంతకార్య
కరము నొచు మెలఁగె సురుచిరతద్ధిత, కృద్గణంబు దహనకీలితంబు. ౨౫

వ. ఇటు మృగయావిహారంబు కొంతప్రొద్దు గడపి చాలించి యమ్మిండుమాయ
లాడు రాజార్హంబు లగు నామిషంబులతోఁ బరివారంబు హరిప్రస్థంబున
కుఁ బోవఁ బంచి విశ్రాంతివ్యాజంబున నర్జునానుచరుం డై కమలాసనవర
మహాంసనీలకంఠసంసేవితం బై శుకముఖసుకవినికరసముపభోగయోగ్యం బై
తనుభవశ్రాంతినస్వస్వాపహరణప్రవణం బై శరద్రాకాశశాంకాకలంకచ్ఛా

*లలరఁజేసి-మూ †పరాశ్రయములు-మూ. ‡విభక్తి మోజ్జ్వలం-మూ.

యాచోరప్రభాభరంబై తెలిదీవివైఖరిం బరిహసించు నొక్క కాళిందీనదీ
సుందరపులినతలంబున విశ్రమించి. ౨౭

క. కనియెం బద్మదళాక్షుఁడు, కననివిననిమేలుసుషమఁగల ప్రియురాలిం
గనికనఁగరాని చంచలఁ, దనులత యుచలంపుఁగోచిఁ దల మనుదానిన్ ౨౮

—శ్రీకృష్ణుండు కాళిందిని జూచుట—

క. ఉపమానభావమును దన, కుపకారముగాఁగఁ దలఁచు నపఘన మగుచుం
దపముఁ బలు *కాఁకఁ దనకై, తపియింపుచునుండునట్టి తపనతనూజన్.

క. కనికని నిరతిశయానం, దనిధిత్వ(ము) గాంచి యేని కమలదళాక్షుం
డెనలేనిముదముఁ గొనుచున్, మనమునఁ గాళిందిరూపమహిమను బొగడున్.

గీ. ఏతదవఘనసంగతి నెట్టిముదము, †విషయివర్గంబుఁ గైకొని వెలసె దానిఁ
గాంచుఁబునరేతదంగసంఘటనగలుగ, భాగ్యమెన్నఁటికబ్బునప్పటికిమగుడ.

చ. సరసిరుహాసనంబుఁ గొని సన్ముఖసీమ గృహీతవాచమైఁ
బరఁగఁగ శ్రోత్రియత్వమునఁ బాటిలి పూర్ణతపంబుసేయఁగా
సరసిజగర్భ! యీయువిదచక్కఁదనం బొనగూర్చునేర్పు నీ
కరుదు ఘటిల్లెఁ గా కరయ నల్పతపంబున నిట్టి దబ్బునే. 3౧

ఉ. సారసగంధిమధ్యమము సంఘటియింపఁగ యోగ్యవస్తుసం
భారము లేమినో యిది యభావముచేసితె పద్మజాత నీ
నేరుపు నెట్టు లెన్నుకొన నేరఁగనయ్యెద దానిమీఁదటం
జేరి వసింపఁజేసితివి సిబ్బెపుగుబ్బలు గొప్ప‡క్రమ్ముడిన్. 3౨

గీ. ప్రస్ఫురద్వ్యక్తిసంబంధబలముకలిమి, నుల్లసించె నలంకృతు లెల్లఁ గాన
లలనయుత్తమకావ్యంపులక్ష్మి యనుచు, నవనిరసికులుగొనియాడుటరుదుగాదు.

గీ. అమథనావిలసింధుమధ్యప్రభూత, పద్మవాసిని యీశరత్పద్మనయన
వ్యక్తిసుందరగ§తాన్యకృతాఖిలోరు, భూషణత ముఖ్యకృతిలక్ష్మిఁబోలునింతి.

సీ. ఇది మన్మథాస్త్రత్వహేతు వౌటఁ దలంప మదికింపులొనరించుమరునిదంతి
దంతిగా దిది మృదుత్వంబు చాలఁ జెలంగ మరునిచేతమెలంగు విరులబంతి
బంతిగా దిది కందుపట్టుగా మి మెఱుంగ సోఁకీనెడు మేలుసోగమెఱుపు
మెఱుపుగా దిది నిల్కడొఱపుమైఁ దనరారమానసప్రియభావ మానునంచ

* కాంతి-మూ. † విషయ-మూ. ‡ కొమ్ముడిన్-మూ. § తాన్యకృతా-

యించగా దిది ఘనరుచినందికొనఁగ, మధురనాదానువృత్తిచే యాస్యపికము
పికముగా దిది తెలికంటిబెళుకు లెనయు, నతులసౌందర్యదివ్యరత్నాకరంబు.

వ. మఱియుఁ గబరీజలధరమాలికయు నలికచంద్రరేఖయు నిరీక్షణచంచరీకావ
ళియు భ్రూమనోరమతయుఁ గపోలశోభావతియు నాసికాకనకమాలయుఁ
గర్ణశ్రీకలితయు నధరమధుసుతియు హాసకౌముదియు సుముఖశాలినియుఁ
గంధరామత్తకోకిలయు వాగమృతధారయు దంతమౌక్తికమాలయు బాహాకు
సుమితలతయు హస్తాంబురుహయుఁ గుచబంధుకయుఁ దనుమధ్యాంచితయు
రోమాళిభుజంగవిజృంభితయు నాభీవిపులయు జఘనక్షమాభిరామయు నూ
రుదండకమండితయు జంఘాప్రభోపరంజితయుఁ బాదలలితయు నంగలతా
చపలయు గుణమణినికరయు నగుచు వృత్తరత్నాకరకృతి నగుచున్న ది
క్కొమ్మెవ్వతె మొకొ, యేముద్దుగుమ్మకైన వనస్థుగా *నమ్మమ్మ యని మనమ్మున
ఘనంబుగాఁ గొనియాడుచు నక్కితవయాదవుండు దండనుండు నాఖండల
నందను వీక్షించి యిచ్చంచలాక్షి యుదంతం బాద్యంతమ్ముఁ దెలిసి రమ్మా
పొమ్మా యని వినోదంబున ముదంబుగాఁ బలిచిన. ౩౬

—శ్రీకృష్ణుండు కాళిందికడ కర్జునుని బంపుట—

క. సిరికి నలవడని శోభా, భర మీయింతికి నెసంగుఁ బద్మాక్షునకే
తరుణి యిది గృహిణి గాఁ దగు, నను నా శిరమెక్కి యుండు టట్లు ఘటిల్లన్.

గీ. ఇట్టిసౌందర్య మొనరించునట్టిధాత
కమరు సత్కీర్తి యీయింతి హరికిఁ గూర్ప
మిక్కుటంబుగ జగములో మెఱయుఁ గాని
యన్యునకుఁ గూర్ప నయశోబ్ధి నది యడంగు. ౩౭

క. ఈగతి నద్భుతరసనం, యోగిహృదంతరములోన నువిదఁ బొగడుచుం
†భోగీశతల్పుఁ డనుపున, నాగుణధుర్యుండు వేగ నరుగుచు నచటన్. ౩౮

సీ. సభయందుఁ బండితసంస్కృతవాణికై వడి మహాసరసిలోఁ గలను హంసి
వలె నభఃస్థలమున జిలుగుఁజంద్రుసొగ వడుపున నవమేఘపటలి మెఱపు
చెన్నున నాలయసీమఁ బ్రదీపంపుఁ గళికవైఖరి బోదె నలరుతీవె
చెలువునఁ దవుపున ఫలశాఖపోలికఁ, ‡బరమకావ్యంబున వ్యక్తిమాడ్కిఁ

* దమ్మమ-మా. † భోగిపర్యంకు డను పున-మా. భోగిశరి యుండు అని కవిభావమేమో.
అది యసాధువు. ‡ బరము-మా.

బులినతలమున మెలఁగెడుపొలఁతిఁ జేరి, తరళలోచనవలనిసత్కార మంది
తుందిలానందమునఁబొందిసుందరదన, వదనమీక్షించిమాధుర్య మొదవఁబలికె.

క. కలికి నీనామ మెయ్యది, జలజానన కన్నవారిస-జ్జను లీదృ
క్షులు హేతు వేమి నీ వీ, పులినంబునఁ దపము సేయఁబూనె సుమతికిఁ. ౪౧

గీ. తేఁటియూఁటనిసుమంబు తేట దోఁచు
నీదురూపంబు గనుఁగొన్న నిర్మలాంగి
యర్హవరకాంక్ష దేవతాప్రార్థనంబు
సేయుచుండెద వని నాదుచిత్త మొదవె. ౪౨

గీ. తన్వి యిచ్చుటఁ బరమసాధనతఁ గాంచుఁ
దనువిలాసంబె యితరసాధనము లేల
యరసి చూడుము పండితురాలవైన
ఘనఫలావాప్తి *బోధనకన్నఁ గలదె. ౪౩

క. నా విని తమ్ములనేలెడు, దేవుని గారాపుఁబట్టి తేటమొగమునన్
ఠీవి నునునగవుసిగ్గులు, తావుకొని మెలంగ నింద్రతనయుని కనియెన్. ౪౪

గీ. †జ్ఞాతృతాధర్మమున కధిష్ఠాన మరయ
నీదురూపంబు ‡గాకున్న మేదినీశ
యాభిరూప్యప్రసిద్ధమాహాత్మ్యమునకు
నధికరణ మౌట మాననీయత వహించు. ౪౫

ఉ. కావున నాయుదాత్త మవికారగుణాకర చిత్తగింపు మే
దేవుఁడు సాయగేస్తుఁడయి తెల్వి జగంబుల కెల్ల నేను న
ద్దేవుఁడు నన్నుఁ గన్నతఁడు దీనిఁ బాలిరమాధినాథునిన్
దేవునిఁగా వరించుకొను ధీ కొని యిట్టి వ్రతంబు నల్పెదన్. ౪౬

గీ. అసితరుచి యమునీనది కధిప నేను, జన్మదేశైకతన సహజన్మఁగాను
నామధేయంబుచే నేని నరవరేణ్య, తత్సహోదరిఁగా నన్నుఁ దలఁపవయ్య.

గీ. కర్ణమిత్త్రదయాంభోధి నీరజాక్షుఁ, డనఁగ నెఱనమ్మి మదిలోన నతని నునిచి
నాయథాశక్తిఁ గొల్చుచున్నాను నేను, భాగ్యమెట్లున్నదో కాని పార్థివేంద్ర.

క. ఎన్నఁడు పద్మాక్షుఁడు ప్రసన్నుండయ్యెడునో కోర్కె సఫలతఁ గొను టెం
కెన్నఁటికో తెలియదు నిన్, గన్నారం గంటిఁ గంటిఁ గన్నా సుఖముల్.

---

* జోదన-మూ. † జ్ఞాతతా-మూ. ‡ గాకున్న-మూ. ధినీశ.

గీ. అనుచుఁ గన్నీరు నించుచు నాననంబు, మిగుల వాంచిన యాతి వెమెఱపుఁ బోఁడిఁ
జూచి తలయూఁచి యానందవీచిఁ దేలి, ప్రావిదారబిడ్డ యా*చైత్రరోచి కనియె.

గీ. నిరతిశయమైన సీమేని నెఱిమెఱుంగు, నిర్మలంబైన సీభక్తినిష్ఠఁ గూడి
రయము మీఱంగ దస్త్రరగ్రహముఁ గూర్పఁ, దస్త్రరగ్రహమలవడు నత్త్వపులకు.

క. అని పల్కి కలికి యనుమతి, గని తూఁకపు వాఁటి వేల్పుగనిన యుదారుం
డనితరలబ్ధామోదం, బున తలయూఁచుచును వేగహరిఁ గనవచ్చెన్. ౫౨

క. † వచ్చిన నచ్చెలు వచటికి, వచ్చి(న) కార్యంబు రూపవైఖరి మదిలోఁ
బొచ్చెంబులేనిభక్తియు, ముచ్చటకడియుంగ సకలమును వినుపించెన్.

చ. చెలికలవార్త యిట్లతఁడు చెప్పినఁ దప్పక యాలకించి యా
జలరుహపత్రలోచనుఁడు చక్కఁగ లేనగుఁబువ్వుసీటిచే
నలఁతఁ దొలంగుప్రేమమున నాననపద్మము కన్నుదోయి మే
లొలయఁగ నింతిఁ జూడ మది కౌతుకనం బొంగి నేగి యచ్చటన్. ౫౪

—శ్రీకృష్ణుడు కాళిందిం గొనిపోవుట—

క. శృంగారైకాశ్రయమా, నంగననెమ్మేను చూచి హరి నవరసపా
రంగత ‡ మగునను భూతిచెలంగఁ గఁ దా మెలఁగె నబ్బురంబు దలంపన్.

సీ. నీలాభ్రమునఁ జాలఁ నెఱికట్టజిగిజాలు మేలు నవ్వఁగఁ జాలు మేనివానిఁ
జలతలేక లసించుతొలివాఁటి బఱమించు నొప్పు నేరము లెంచునొల్లెవానిఁ
దొలుతవేళ నెసంగు జలజాతములఁ గ్రంగు గలకన్నులబెడంగు గనెడువాని
నమృతధారలు చిల్కు నట్టిచందురుకుల్కు, నగవుసవ్వలత్కు మొగమువాని
లచ్చిపే రాదిగలపేరు మచ్చవానిఁ, గౌస్తుభకిరీటముఖవరిష్కరణవాని
సుడికి నీడగు నొకవాలు వడయువాని, విందుకన్నానఁ గన్నగోవిందుఁ గనియె.

గీ. కనియు గ్రనసితరహృద్ధ్యానఘటితసర్వ, దేశసంతతదీవ్యత్తదీయదివ్య
రూపజాలంబులోనఁ దద్రూపమపుడు, మిళితముగఁ గొంతసేపింతిమిన్నకుండె.

క. అంతటఁ గాంతకు లక్ష్మీ, కాంతుని నిజరూపగరిమ గనవయ్యెఁ దదే
కాంతి(క)దృష్టిప్రభావత, బొంతఁ బురందరుని కట్టి పొసఁగుటచేతన్. ౫౮

చ. హరినిజరూపమాత్మ ముదమారఁగఁ గాంచినకాంచనాంగికిం
బరిచితిఁ జెందవయ్యె నభివాదనవార్తలు సంస్తవక్రియల్

---

*చిత్రరోచి- †వచ్చి యచ్చెలువ యచటికి ‡ మగుననుభూతి గ్రనసీరతహృ-మూ.

కరము మనంబులోపల నఖండితభక్తి నుదీర్ణలజ్జకున్
వారివారి యూఁచుటం గనని యుట్టికచాకచి సంఘటిల్లఁగన్. ౫౯

గీ. వెలఁది "యభ్యాగతః స్వయం విష్ణు"రితి వి
చారసాంగత్య మొనరఁగఁ జలదసాంగ
వీక్షణాంభోజమాలి కావిసరములను
బూజ యొనరించె నాజగత్పూజితునకు. ౬౦

గీ. కృష్ణఘనరుచి దనచెంతఁ గీలుకొనఁగఁ
జామముఖచంద్రుఁ డప్రకాశత వహించె
నిడుదక్రేఁగంటిచూపులు నీలవేణి
రుచివిలాసంబు దన్మైత్రి రుచి గొనంగ. ౬౧

గీ. అంబుజాననదనుఁజకోరాక్షి యనుట, నిజముగాఁ జేయఁదలఁచి యోనీరజాక్షు
వదనచంద్రుని బాయ కవ్వారిగాఁగ, బాయకొనఁజేసెఁ దనదృక్చకోరకములు.

చ. అపుడు ముకుందుఁ డింతిఁ గని యంబుజమిత్రతనూజ నీకు ని
త్తపము ఫలించె రమ్మనుచుఁ దబ్బుల లేనగు మోము గ్రమ్మఁగాఁ
* దపనతనూభవం జెనుట తద్దయుఁ గ్రమ్మ రథంబుమీఁదఁ దాఁ
గృపవిడుకొంచు ధర్మజుని కేళిపురంబున కేఁగె నెమ్మిగన్. ౬౩

క. అచ్చట నారాజున కమ్ముచ్చట దెలియంగఁ జేసి భూపతిమదిలో
ముచ్చట దీరఁగఁ గొన్నాళ్ళచ్చటఁ బ్రేమమున నిలిచి యనుమతియంతన్.

క. పురమున కేగుతలంపున నరవరునానతి గ్రహించి నలువారఁగ న
న్నరుఁ దోడ్తోని చనువేడ్కల్, పురణింపఁగ డాయఁజేరి భూపతిఁ బలికెన్

గీ. అనఘకృతి యపార్థ మగునేని పండిత
హృదయమునకుఁ బోలె హితము గాదు
నాదుమదికి నెపుడు నరుఁ బాపు మటుగాన
నన్నుఁ బంపి రాఁగ నరవరేణ్య. ౬౬

వ. ఇట్లు బావయగు తోవకొమ్మ తోలంగుడు బావబిడ్డబిడ్డనిచే †సోమానుల
పెట్టుంజెట్టఁ బట్టి తనవెనుకటిరాకకు నావతివడసి యత్తండు రా ‡నయ్యాడ్డ
కేల్దోరబిడ్డ ప్రామిన్మసామ్ముబరణి గన్నకన్నెఁ గొని నిజపరివారపరివృ
తుండై కదలి సంభ్రంపుటగడిత పడయు బెడంగుప్రోలు మేలుబంతికిం జని

* తపనతనూజభవన్ జ.ఖ.ఖ.మూ. † సోమానుల ‡ నయ్యాడకేల్దోరబిడ్డ

యెంతయు సంతోషంబార నయ్యుదంతంబు నిజాంతరంగులకు నెఱింగించి తదనుమతి రిక్షనుడువులఁ దెలియం బ్రోడతొలిప్పుట్టువుజన్నిదంపు వారులఁ బౌయిల రావించి నిరస్తదోషతిమిరంబును సుగుణవర్తియు సుగ్రహాస్నేహంబు నగు నొక్కసుప్రకాశ వివాహముహూర్తం బేశ *ద్వాసరభాసురం బని నిశ్చయింపించి సర్వజనులం దత్సరంబునకు రా నియమించి మీఁదటి †తక్షచక్షరవతిం బిలిపించి తత్ప్రాలంకారంబునకు నియోగించిన. ౬౮

గీ. అన్నివింతల కాస్పదం బగుపురంబు, నందు నేవింత ఘటియింప నతఁడు నేర్చె
నయిన నత్తఱిఁ బౌనరుక్త్యం బొనర్చె, నతులచాతురిఁ గొన్ని పదార్థములకు.

వ. అంత. ౬౯

సీ. వేవెలుంగులు గల్గు విన్నాణి వేలుపు ముప్పోఁడుములు నిల్చు గొప్పగద్దె
ముత్తొంటిపలుకులు మొనయు వేసము వాఁడు తమ్ములనగియించు తళ్కుతేఁడు
సుడివాలు పేరింటిపులుఁగు నేడునొయారి పండ్రెండురూపులబలిమికాఁడు
కడలియిల్లటపల్లు బెడఁగుబల్లుడికన్ను పగలుగావించు నేర్పరుల మేటి
లెక్కపేరింటిగుఱ్ఱంబుదక్షుజోదు, చుట్ట మంతటి కనఁ దగుదిట్టసామి
చాయకైవడి వెన్వెంటఁ జాయరాఁగ, గూఁతు పెండ్లికిఁ జనుదెంచెఁగూర్మిమిగుల.

గీ. పెండ్లియఖిలప్రమోదంబుఁ బెనుచుజగతి, నఖిలజగములతండ్రి పెద్దామనసఁగఁ
బిలువకున్ననుఁ బిలిచిన నెలమి రాక, యుండు వారు జగంబుల నుండు టరిది.

క. పంకజలోచనునప్పురి, సంకోచాభావ మొనర సర్వజనంబుల్
పొంకము మీఱి మెలంగఁగఁ, బంకజనాభోదరంబు భాతిం గనియెన్. ౭౨

సీ. చతురాగమానూనసారస్వతస్ఫూర్తు లొకచోట నానంద మొదవఁ జేయఁ
‡జతురాతితతినదర్శనఘోషవైఖరు లొక్కచో మోదంబు నిక్కఁజేయఁ
జతురుదాత్తకవిత్వసాధునిస్వానంబు వీనుల కొక్కెడ విందయొసఁగఁ
జతురభినయసమంచన్నేదురధ్వను లొకవంక సంతసం బొప్పఁజేయఁ
జతురనల్పమహావాద్యవితతనాద, మంజిమం బొక్కదిక్కున మదికుదుర్ప
నద్దిరద్దిర యోహహో హెయారభళిర, యపుడు నాదాత్మకబ్రహ్మమయ్యె బురము.

క. అకుకవ్యక్తులకైవడి, నకృతాఖిలదోషయోగ మయి సుగుణాబై
కుకవులవాక్కులు ముదమిడె, సకలజనుల కిచట బ్రహ్మసదనత నేమో. ౭౪

*ద్వాసుర. †తక్ష చక్రోరకతిజ. ‡జతురతితతినదర్శఘోష.—మూ.

ఉ. సందడి జాజి భూ(ష)వరసంతతభూషణపద్మరాగముల్
పొం దగునందునం జివురుబోఁడె లటంచు గజంబు లూని యీ
సొందుచు మీఁదికిం బఱువ నూర్ధ్వతలంబున నిల్చె నవ్వి రా
నంమలు లేక తన్రుచులఁ సోఁకును రక్తవితానరోచులన్. ౭౬

సీ. వితతవజ్రోపలావిరళకీలితములు మున్ను వీథులు పంకమునకుఁ జొరవు
బహుళమహోదారభద్రేభదానవారాపగాపూర్ణంబు లయ్యె నిపుడు
బహుళమహోదారభద్రేభదానవారాపగల్ పయిగ్రమ్మ సమితనృపతి
సంబాధహేతుకసంఘర్షణచ్యుతచారుసౌవర్ణభూషణరజంబు
తెలియ నవి పంకమై *నేరెటేర్లఁ బోలఁ, దత్క్షణంబునఁ దద్వృత్తిఁ దాల్చె వీథు
లంతటనపంకతవహించె నమిత †జన్మి, బహుళసమ్మర్దజనితోష్మబలముకతన.

గీ. లక్షణాఢ్యగుణస్థూలలక్షులందుఁ, దనరె స్వసమర్పణము పరార్థంబుగాఁగ
నక్షిలక్షితలక్షణుం డయ్యు నధిపసించెఁ, జెన్నుగ స్వసిద్ధికై పరాపేక్ష మచట.

క. చిత్రవ్యక్తుల నట వా, క్చిత్రాభి‡వ్యక్తు లేమి చిత్రం బగునే
చిత్రవ్యక్తులఁ జిత్రము, చిత్రధ్వనియుత సర్వచిత్రత మెఱయన్. ౭౮

## — శ్రీకృష్ణుని మంగళస్నానము. —

ఉ. అంతట గర్గముఖ్యు లగునట్టి మహీసురు లెల్ల వచ్చి శ్రీ
కాంత సమీపవర్తి యయి కానఁగనయ్యె ముహూర్తవేళ మీ
రింతట జాగు మానఁ దగు నిచ్చ శుభార్థపుమజ్జనంబుపై
నెంత వసింపఁ జేయు మన నీహిత మొప్పఁగ మాధవుం డొగిన్. ౭౯

క. అంజనగిరితుల్యుండు ని, రంజనుఁడు జగంబులెల్ల నంజలు లిడఁగాఁ
గుంజరగతి వచ్చుచు న, భ్యంజనమున కతులపీఠి నాశీనుఁడుగాన్. ౮౦

ఉ. వన్నెలు మీఁదు గొన్న చెలువం గొని పొంగుచు నస్మదాదులం
గన్న యనాదిపూరుష యఖండమహోదయ యిట్టిపెండ్లి నీ
కెన్నఁగఁ దన్మహామహిమ నే కద గాన భరింపు మామె నం
చన్నలినోద్భవాదిసుర లచ్యుతునౌదలఁ బెట్టి రక్షతల్. ౮౧

చ. దరము దరంబు నిచ్చ రొదఁ దాల్చును దానరిగాను వీణ వ
ల్లరియుఁగ మేళవింప నగు నస్ఫురితాకుర మద్దిసాటియే
సురుచిరవర్ణసన్మధుసూక్తిగళంబుల కంచు నెంచ న
ప్సరమునిచెంతి సంగినలు పాటలు పాడిరి నేర్పుమీఱఁగన్. ౮౨

* నెరెటిగ్గపోల. † జ. ష్ట. ‡ వ్యక్తిలేమి.

సీ. రమణీయనాయకరత్నంబు నంటంగ హేమవల్లికి వేళ యిదె యటంచుఁ
జంద్రరేఖకు నబ్బుసాంద్రాంధకారాభచికురముల్ దెరలించు చేగయుండుఁ
గృష్ణమేఘముచెంతఁ గీల్కొని మెలఁగంగ విద్యుల్లతకుఁ జాలువెర వటంచు
నిదె సర్వమంగళాస్పదుసౌఁదలంటంగ మందాకినియె నేర్పుఁ జెందు నంచు
విభుని సేవింపఁగ నుదార విత్త యనుచు, నీలవేణియె గోవిందునెలవటంచు
నంబుజాక్షులునర్మోక్తులాడుకొనుచుఁ, గడుముదంబొప్ప మధువైరిఁ గ్రమ్మికొనఁగ

సీ. స్నిగ్ధంబులై మించి చెంతలచూపులు రమణినీలాబ్జశోభనము లుడుప
*సేదనీరొగిఁగ్రమ్మి చెన్నారు నెమ్మోము సమరందపంకజచ్ఛాయఁ బూన
ననవిల్తువిల్కుఁ బోలినవీఁపుపై వాలుచుండ మొగ్గదుచుఁ గీలుజడ చెలంగ
బిగువుకంచుక(ము)లోఁ బెడఁగుదిట్టమెఱుంగు జన్నుదోయి
హారములు దూఁగఁ గౌ నసియాడఁ దొడఁగ
పలచునూర్పులు పెంపెక్క పలుకులు శక్కఁ
గంకణధ్వను లలతాళగతుల నెనయ
శౌచితల యంత నొక†మహోదారజఘన.



వ. ఇట్లు యదుకుంజరుండు నాభ్యంజనుండై యొక్కకుంజరయాన కైదండ యొసంగఁ గ్రొమ్మెఱుంగు చండిగొను ఘనాఘనంబునువున ధరాధరశృంగోన్నతంబగు నవగాహనగేహంబుఁ బ్రవేశించి యొక్కమించుఁబోఁడి వలపులు నించు మంచిగంధంబు‡టటకలిం బెన్నెరుల నూనియ §గ్రుక్కదగ్గఁ జేయ మఱియొక్క కొమ్మ కమ్మతావు లూను జలంబుల జలకం బార్ప నొక్కరంగులాఁడి బంగరురంగుల తెఱంగుల మరుంగుపడఁజేయు దువ్వలువ లొసంగ నుత్తరాధరాంగంబుల ధరియించి కొందఱు మందయాన లమందానందంబున నెడనెడ మంగళారాత్రికంబు లొసంగ వాసంతికకుసుమ విచిత్రాస్పదంబును జంపకమాలోత్పలమాలికా భ్రమరవిలసితలసితంబును మంజుభాషోర్వశీసుముఖీమనోహరంబును నానాపదార్థసమృద్ధంబును బ్రసన్నంబు నతిమధురధ్వనిసమాలింగితంబు నస్పృష్టదోషలేశంబు ననుగతాఖిలాలంకారంబు నగుచు మహాకావ్యంబుతో నెక్కసక్కెంబు లాడు వివాహవేదిం దా నాయకరత్నం బగుట నధివసించి కొంద ఱిందువదనలు కురుల తడియార్చి సంస్కారధూపంబు దీర్చి జలార్ద్రానిలంబులం దేల్చి సురభిళకు

* సేదనీరొగి-మూ. † మహో-దార-మూ. ‡ టలక-గున- § రంగంజేయు-మూ.

సీ. కంజనేత్రుండు బహుపరిష్కారయుక్తిఁ, ద్రిగుణసంబంధభవ్యతఁ దేజరిల్లు
నప్డుమసత్కృతితో మైత్రి నందికొనియె, నొకయ దోషత తక్కువై యుండెఁగాని.
క. మును హరునికంటి సెకలం, జనసిన యొకమదనుఁ గనియె శ్రీకాంతుఁడు దాఁ
గన వింతపెండ్లికొడుకై, మనుచు ననంఖ్యాకసుతనుమదనులఁ గనియెన్. ౭౮
వ. అంత.
ఉ. ఐమువరాంఘ్రి హంసలవయూమణి శ్రీరపదాభిషేచితా
నాదరదానదక్షిణతఁ నల్వగు మేల్వరించుపురాలబ
ద్వేదిక సల్పి నెన్నుదుటఁ జెట్టిక జిగిమించు నక్షితల్
వాదనలేని వీణె లనఁ బాటలనీలల *కుల్కు లొప్పఁగన్. ౭౯
క. ఉనుగు నెఱపెండ్లి దేవకి, కొడు కప్పుడు నీకుఁ బెండ్లికొడుకై యమరెం
గొడు కగును నీకు మదనుం, డుడుగర లందఱును మరున కవిదా వింతే ౮౦
గీ. అనుచుఁ జెలియలు మఘలొత్తి లాడుచున్నఁ
బడఁతి యొక్కర్తు మిగుల నేర్పరి సుగంధ
తైలమున నింతితల యంటి తార్చి తీర్చి
నానెముడి సంఘటించెను నానెమిఁడికి. ౮౧
సీ. కలికముడిగూడనిద్దంపుఁగురులసొంపు, సంపుగనుపట్టె నవ్వేళఁ గుందరదకుఁ
దాళితత్యంబు మీఱంగఁ దైలరసము. వఱపిఁద్రిసమునిక్కపాణియనఁగ ౮౨
సీ. మచ్చెకంటులు మోహంబు హెచ్చిసచ్చి. పసుపునలుఁగార్చినప్పుడప్పడఁతి మేను
దీన యొప్పారెఁగాఁకలు దేరి †మెఱుఁగు, జోకఁ గైకొన్న పైఁడిశలాక యనఁగ ౮౩
చ. అలకలఁ గొప్ప మీఱుకుటీలాలక యొక్కతె దివ్యచందనా
మలకము నూనె నిగ్గునఁ జిమానఁగఁ జెట్టెను మేలుతావులం
జిలుకునవాంబుపూరములఁ జల్వ మఱొక్కతె చెన్నుమిన్నఁగా
జలక మొనర్చె నొక్కచెలి చక్కఁగ నై తడి యొత్తుచుండఁగన్. ౮౪
గీ. వనిత యొక్కర్తు మేలుదువ్వలువఁ దెచ్చి, సొరిదిఁ గట్టంగనప్పుడు సూర్యజాత
నప్రిసాదశరజ్జాతజలదపటల, ‡శేదితాకార యగుచంద్ర రేఖఁ బోలె. ౮౫
క. చెలియొకతె చెలువయూఁదల, గలతడియుడిగింప నొక్కకలికి సుగంధో
జ్జ్వలధూపధూమ మొసఁగెన్, జలముగ్ధామములు జన్యజనకము లనియో ౮౬

*గొల్కు-మూ. †మెలఁగు-పా. ‡దేశితా-మూ.

## —♦ కాళిందిని జెలు లలంకరించుట ♦—

ఉ. ముచ్చటగాఁగ నొక్క చెలి మోహనగాత్రికిఁ గొప్పు దిద్దఁగాఁ
బొచ్చెము లేని మెల్పులపుఁబువ్వులదండల గొప్పకొప్పునన్
మెచ్చగ నిల్పె నొక్క చలమీనవిలోచన పాటి గైకొన
న్వచ్చు నరాతులం బఱప నచ్చిన కీర్తులమూర్తులో యనన్. ౧౦౮

చ. కుటిలములైన ముంగురులఁగూడి మెలంగెడుకామినీమణి
నిటలమునందుఁ గస్తురిని నెచ్చెలి యొక్కతె బొట్టుఁబెట్టెఁ దాఁ
గుటిలతమూన ఫాలమయి కోమలచంద్రుఁడు వంకపూనుచుం
జటిలకళంకముం గుటిలసంగతి మిక్కిలిఁ గాంచెనో యనన్. ౧౦౯

క. పంకజముఖి కొకనెచ్చెలి, పొంకపుసీమంతవీథిఁ బొందుగ నిలిపెం
గుంకుమమార్గం బహితా, తంకముగాఁ గబరి పీరతం దాల్చెనన్. ౧౧౦

చ. నడుము మహేంద్రనీలమణినాయకసూనా మగరాల బొట్టుచేఁ
గడునలరారు ముత్యపుఁజొకాటపు బొట్టు నెలంత కొప్పునన్
విడువక నీక నెచ్చెలులు వెంబడి జాల్గొనిరా మహాభయం
పడి ముఖచంద్రుఁ గొల్చుటకు వచ్చినసింహికశాంకఁ బోలుచున్. ౧౧౧

గీ. కంటఁ*గాటుకఁదీర్చెనుగలికియొక్త సరసిజాక్షి కింగనుదోయి†సామ్యపక్షి
దళిన మొనరింపఁగోరిఁ దాదృశీక్షు, గల్గు సిద్ధాంజనముఁ బెట్టుకరణిశోభ

సీ. ముద్దులాఁడికి నొకబోటి ముత్తియంపు, మేలుముంగర ముక్కున‡మెరపనొప్పె
నధరమాధుర్యమాసింప నవతరించి, చెంతమెలఁగెడునమృతంపుఁజినుకనంగ.

క. శ్రీకాంతసమ్య మాకృతి, నేకా దర్థపరికాశ నేనియుఁ గలదన్
జో శ(ను)పీనుల(న)తులా, లోకపునవరత్నకుండలులు దైవాఱెన్. ౧౧౩

క. అంజనరుచితీవ్రసిత, మంజులతరనలదపాంగమంజరి మిగులం
గంజాక్షిగండతిలచున, నంజన§రుచిరంపుబిందు వందముఁ జెందెన్. ౧౧౪

క. అమనాధరయరుణమ్యుతి, శరణాధరసీమఘటితసమ్యగలక్తా
స్ఫురణంబుఁ గవశ నొకచెలి, తిరుగన్ ఘటి(యి)ంపఁదలఁచి తెలివిన్మానెన్

గీ. తొలఁగకుండసువర్ణబిందువులఁజెంది, మధురబంధంబుగాంచిసమ్మోదమునించి
సాధువాగ్రీతిఁగైకొన్న చానకంచు, కంబులోఁజన్నుగవ వ్యంగ్యగతిఁజెలంగె

---

* కాటిక- †సామ్యసాని-మూ. ‡ మేగనొప్పె-మూ. § రుతంపుబిందు-మూ.

క. మధుపర్కాద్యుపచారము, లధిగతపరమార్థతల్పోఁ డగుచు నొనర్చెన్
మధువైరి కల్లుఁ డతఁడుగఁ, బ్రిథితమహాభాగ్య మొనరుబలువేలు పొగిన్.

చ. జలరుహరాగనీలమణిసంగతకాంచనమయంపుఁబాత్రిలో
జలరుహనాభపాదజలజంబులు భక్తి ప్రసిద్ధ వారిధా
(ర)లఁగడిగెన్ దివాకరుఁడు రాణి యొసంగఁగఁ దన్మణిప్రభా
కలనఁ ద్రివేణికాజలము కైవడి పాత్రిజలంబు కైనడిన్. ౧౧౭

సీ. సాత్త్వికస్వేదమకరందసహిత మయిన, హరికరాబ్జంబు ధారోదకాభిసిక్త
మగుచు నాత్మకరస్పర్శ నతిశయిల్ల, నాతి రవియిచ్చె బ్రహ్మార్పణ మ్మటంచు ౧౧౮

ఉ. చేతనమాత్ర *సజ్జగతి శ్రీపతికా మదినిల్పి యాత్మసం
జాత నొసంగువాఁడు నిజజాతిసముల్లసనప్రదాయి నా
నీతఁడె నాదిదేవునకె యింతి నొసంగినయర్యముండు వి
ఖ్యాతిగ లోకదీపకత గాంచఁడె యంచు నుతించి రుత్తముల్ ౧౧౯

క. తెర దొలఁగ వధూవరులు చెలివా, తెరసాగసులు గనఁగ మెలఁగ దీవ్రిపుమరువా
తెరగలుగు(?) తెఱవ సిగ్గుల, తెర తమి మీఁదలంగ మదిని దెరలఁగ సాగెన్ ౧౨౦

సీ. శుభగుణాస్పద మైనయీసుకరకరం, ముకుఁ దద్వాత్తె నెవ్వాడు గనిన కంబు
వెల్లు సరియగు నను రీతినింతి †కొలికె, విభుఁడు పొందుగఁ గుటిలుం చెసు భగుణాంబు ౧౨౧

చ. చిఱునగు తేటల స్ఫురుల శ్రీసిరువొందిన మూర్తియుంబుల
నెఱవార యింతి యొఁగాఁదలను సిల్పిన నావృత్తిపైరమూని యు
క్కఱితి మొగు లంచు నచ్చి పయిఁ గ్రమ్మిన మించుల నా మెలంగెమై
మెఱుపుల ‡తీఁగెమై మెలఁగి మెప్పును మొగ్గలనిగ్గు ఓగ్గుచున్. ౧౨౨

క. పరమాణుమధ్య శీహరి, శిరమున ముత్యాలపాలు చేదోయి నిడెన్
హరి(తను)వు తళ్ళతంబై, కరమురుదుగ నపుడు పుష్పఘనమైయుప్పెన్ ౧౨౩

సీ. సాంబడివారి హెచ్చరికె మాటలు తేటమాటలాఁడుల§ తేటనీటుపాట
లఖిలానవద్యవాద్యారావములు సామముఖవేదరవములు భూరిశాస్త్ర
వినదముల్ దచ్చననేవ్వఁబలుకులు హంసమధురధ్వనుల్ వస్త్రమర్మరములు
స్త్రీశుభభూషాగణశింజితంబులు వందిశబ్దముల్ మాగధస్వానములను
సకలసురహానిమనుజసంస్తుత్యయుక్త
జయజయధ్వానములు నొక్కసమయమునను

*సజ్జగతి-మూ. †కొలికి-సంకరము ‡తీఁగెమై-మూ. §తేటలనీటు-మూ.

గలసికొన నైన యవ్వింతకలకలంబు
చాల దీపించె గోయింటి పాళిలవేళ. ౧౨౪

క. పువ్వులదోయిటికయ్యం, బవ్వనితాసనుల నలరc *నందించెc గడుం
బువ్వులరువ్వులకయ్యము, పువ్విలుతునినమమ నలరc బొందింపంగన్. ౧౨౫

వ. అంత. ౧౨౬

ఉ. వేలిమివేళయందు నరవిందదళాయతలోచనామణుల్
వేలిమిపాట రాగములు వింతలువింతలుగాcగc బాడ సం
దోలి నడంగె నారదముఖ్యోర్జితనిర్జరగాయనప్రవే
కాళికరాజ్ఞసంవసుమదంచితమంజువిపంచికాధ్వనుల్. ౧౨౭

సీ. ఇంతిహృదయావసచ్చిరమేఘమాన, మదనదావానలజ్వాలమున మణంగె
బహిరవిరహితనై వాహపవనమిత్రి. సూనకీలలుమిగులనుద్దామములుగ ౧౨౮

క. ఇద్దఱు వేలిమివేని, స్నిగ్ధపువజ్రంపుcబీఠి నెఱిcగని యంగా
నిద్దఱికేc గూర్చువారై, యిద్దఱిసందున మనుంసు నిలిపి వసించెన్. ౧౨౯

చ. పొగ సొగయంగ ముద్దుదెలిపొందికకాటుకకంటికోనలన్
గిగిరొమొదునశ్రుబిందువులు దీర్ఘరుచుల్ దలపించు నీలపున్
జిగిబిగిcగాంచు ముత్తియప్రుcజిప్పలలోపలనుండివచ్చు హే
తుగణములై(ప)ముత్యములఁ గూర్చొనుకప్పు మెఱుంగుపొంగులన్. ౧౩౦

క. పొగ నిపవన నొకవంకకు, సొగసులనెమ్మోము నిలిపి చూచెను నవలా
పొగరుకటిచాయచూపుల, మగసి తెలుప్రుcగొంజ్లు నీలమణులై తనరన్.

ఉ. కమ్మలపచ్చరావయిcడికాంతులు చూపుల తెల్పుకప్పులో
క్కమ్మడిcజాదపల్లవమహోజ్జ్వలకాంతులcగూడి పంచవ
ర్ణమ్ములముప్పిరిగొనీడ(దస)నాథుని వెంటc బ్రదక్షిణమ్ము చో
క్కమ్ముగcజేసెc బద్మహితుగాదిలికూcతురు నీటిచూలికిన్. ౧౩౨

మ. ఘనసేకస్ఫూర్తిcగెడవేళc బద్మముఖి యంచత్పావమున్వ్యక్తకారం
బునc బట్టింపcగc గృష్ణమూనసమునన్ మోదాతిరేకంబునం
గనకాంగీమణి కబ్బుసౌఖ్యమహిమం గంజాస్త్రప్రవీరాగ్రిణీ
కన దేకాంతవిభుత్వవైఖరులు లెక్కల్ సేయcగా శక్యమే. ౧౩౩

*. నందించె-మూ.

క. నీలమణిమయపుసనిక, ల్వాలామణి దొ్రక్కె శౌరిపరతంత్ర(త)చే
జాలుకొనువడుగురుచులను, నీలోపల మబ్జరాగవింద యెవర్వన్. ౧౩౪

ఉ. మోదముతో సుభద్ర చెలిముద్దులగండతలంబునందు సా
మోదనిశాకకర్దమము పొందుగ నించెను నవ్వులాటకై
నీమకపోలభాగమున నిండి తొలంకెను తేటమిన్న యో
కా చెవు డే నొసంగుసిత కాంతులు మేలె యటన్నకై వడిన్. ౧౩౫

చ. హరినుజెక్కుటద్దమున నర్మమునంగన సత్యభామినీ
విరచితసంజ్ఞ పూర్వకృతవిశ్రుతమైత్రియు హెచ్చరింపఁగా
స్ఫురదరుణంపుఁ గుంకుమముపూసినఁ దచ్ఛవి యొప్పెఁ దేటి (దే)
హరుచిఁగనంగ మోము గను నద్భుతరాగమునీసయో యనన్. ౧౩౬

చ. ముసిముసి నవ్వు తేటలును ముత్యపుఁబాపటచేరుచాలులుం
బసగలముక్కుముత్తియపు బల్లిఁయున్ గుమిఁగూడి ధారయై
మసలుచుఁ బోయి మింటికొన మంచిరుచిం దనరిన్ వసిష్ఠుతోఁ
గొనఁగెను నైదువం గనియెఁ గన్యచరిత్రి మొనంగి మొ్రక్కుచున్. ౧౩౭

గీ. పురుషతల్లజు పెండ్లి నివ్విధముభుజించు
మధురచలకాన్నములు మీఁద మనకునబ్బుఁ
బేర్మిఁ గృష్ణుని కింకొక్క పెండ్లియైన
దిరుగ నే తెంచుపుణ్యంబుదీర దేని. ౧౩౮

క. అనియెన్ను చు రుచులానుచుఁ, గొనకొనెసమయంబులెన్నగొనుఁడా యనుచుం
దినఁదినఁగ వింత లనుచున్, జనత తదన్నానుభూతిఁ జాలం దనిసెన్. ౧౩౯

సీ. మంచిభోజన మబ్బె మాగధక్షితిపాలసలలితపరిణయోత్సవమునందు
నవి చెప్ప నేటికి నంతకంటెను మేలువెలయుకాశ్మీరేశుపెండ్లిబంతి
యాబంతికన్నయేమి యంతకు(మి)క్కిలి బంగాళపతిపెండ్లిబంతికూడు
ఆకూటికన్నయేమి యంతకంటెను బాగు వంగేశుపెండ్లిలోవంటకంబు
అవివచింపంగ సహ్యమా యంతకంటె, నెక్కుడైచక్కనై నాల్కసొక్కఁజేసెఁ
*బోల్కి లేనిదిహరిపెండ్లిబోనమనుచు, జనులుమృష్టాన్నములఁదృప్తిఁగొనిరిచాల

గీ. ప్రోలుసొరఁబడి వెడలుచుఁ బురుషచంద్రుఁ
డురుతరోజ్జ్వలమణిసంయుతోత్తమాంగ
మభినవలతాంతవిశదంబు నగు(టఁ) బొఁప
మాన్పవగియెను పెండిలిపాను పెక్కె.

* పోల్కి జెనిశి-మూ.

ఉ. పాటలగంధితోడ హరి పానుపునందు వసించునత్తఱిం
బాటలగంధు లింపెసఁగఁ బాడఁగఁ బాటలఁ గప్పురాటలన్
మాటికిఁ గేలు దప్ప కెడమం గడి యాస్వాదమానసంపుపూ
ఝాటప్రసీటు లెస్స నెకసక్కెపుమాటలు మీఱెఁ గార్యమున్. ౧౪౩

— శ్రీకృష్ణునకుఁ దాంబూల మిచ్చుట —

క. ఆమెడఁ బదినాఱులఁబలు, చాయలుగల వేల్పుఱేఁడు సన్నుతి యొసంగం
జాయకొమరుండు దమ్ములు, మాయయు భర్తకు నొసంగు నభిరతి వచ్చెన్.

ఉ. వేయగు పాదపుల్ గలిగి విశ్రుతిధీమహామంబు గాంచఁగా
చాయపొలంతి తేఁ డపుడు సంకేతమై తగునీకు నెప్పుడుం
బాయని మాంద్యపంగుతలు భావజుతండ్రికి వీస్య మిప్పు డే
చాయ నొసంగె దంచు హలి సాత్యకిఁ ఖ్యాతి నవ్వుచుండఁగన్. ౧౪౪

గీ. మాంద్యపంగుతలన్నచో మాను జార్ధ, సమసపంబచ్చటను పష్ఠి జానుమీఱు
ననుచు నవ్వుచు నుత్తరంబాడికొనుచు, హరికి నసితుండు వీడియంబమరనిచ్చె.

ఉ. తెలివి దలిర్ప నకబలిఁ దీరఁగఁ గృష్ణుఁడు దివ్యరత్నముం
దెలిబలుప్రాను మోముకళితేటలు గల్గిన గిడ్డి సీగికి
న్వేలయఁగఁ బంచి తద్ఘ(టి)తకశ్రుతసత్వయ ధేష్టవస్తుసం
కలన సమస్తలోకముల గారవ మొప్పఁగఁ దన్పి పంపుడున్. ౧౪౫

— అప్పగింతలు —

క. అంతట సంతటి చట్టం, బంతఃకరణం బపారగానందపయో
ధ్యంతరమున నోలాడఁగ, నంతికచరుఁ డౌచుఁ గూర్మి నల్లునిఁ బలికెన్. ౧౪౬

ఉ. ఎల్లజగంబు లేలు పరమేశ్వర భక్తజనావనార్థమై
యుల్లలితంపు మానవసమీహితచేష్టలు గాంచుసామి నీ
వల్లుఁడవైతి గానఁ జరమాద్రికి నవ్వలఁ జిమ్మచీఁకటుల్
డొల్లఁగఁ జేయునట్టిడిపటుత్వము గాంచు ప్రభల్ భరించితిన్. ౧౪౭

గీ. ఎంతకాలంబునుండియో యెదయకుండు
పటుతమోగ్రస్తత హరింపఁ బాలుపడితి
నస్తమయశైలాన్యమైనట్టి యభ్యుదయముఁ
జెందఁగాంచితి నయ్య ముకుంద నేను. ౧౪౮

గీ. హారణ మొసఁగుట మామకు నర్హమంచట, నఖిలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల, దక్షిణాలోకభర మిచ్చుతలఁపు నాది.

క. హారిదశ్వుఁడు హారి నీగతి, సరసచతురవచనరచన సమ్మోదితుఁగాఁ
గర మొసరింపుచు నానతి, వరమపురుషు చేతఁ గొనునఁబలికెం గూఁతున్.

ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపవు
శ్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీనతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౫౩

గీ. భాగ్యసౌందర్యశీలానపత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోనవిక్రియోత్పత్తిగగన, కుసుమసాదృశ్య మొందింపఁగోరవమ్మ.

గీ. అంబుజాతాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుముహారిజాయననుసరించి
హారికథానుగతిస్ఫూర్తి నలరనీకుఁ, దల్లియగుచాయఁ బోలంగఁ దల్లి మేలు

గీ. వగలుగావించి మాయమ్మ వగలుసేయు, వానిబిడ్డన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రిపూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము. ౧౫౫

శా. అమ్మా మమ్మెడఁబాసితంచు మదిలో నావంత యైన న్విచా
ర మ్మానం బనిలేదు కాంతలకు నబ్రమ్మే యదెన్నంగనై
న మ్మానక్ భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపన్
సమ్మానింపుచుఁ జాయఁ జెవ్వడు నిజస్ఫారాక్షిగాఁ జూచుచున్. ౧౫౬

చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హారణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రిపట్టికిన్
హారణమొసంగు టిజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
దరయ బితృస్వకాంతు ధృఢమై మదిఁబుట్టెడు నట్టిబోటికిన్. ౧౫౭

ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోపచారస
ద్భావముకై ద్యులోకతరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావము పొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములో స్మరింపఁ గనుపట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౫౮

క. అని చాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తర ళేక్షణచే
వనజాప్తు డోకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్.

క. రమానారాజకుమారక, రమణీయగుణాభిరామ మైథిలకన్యా
పహారణపరఖరదూషణ, సహజావైరూప్యకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనానందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలత్ప్రోక్షిత కటాక్షాసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక ఉభివ
సన్నయభట్టారక అహోబలపత్యాహ్వయకవిమహో
పాధ్యాయభట్టారకప్రణీతంబైన కాళిందీకన్యా
పరిణయంబను మహాప్రబంధమునందు
పంచమాశ్వాసము.

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము

## — షష్ఠాశ్వాసము —

క. శ్రీమత్పద్మజభవహృత్తామరసస్ఫారభద్రగదశముఖభంగా
శ్రీమహిత హితజవాంబుజ, ధామాధిప్రముదితాత్మ దశరథరామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

క. చారుశ్రీజనికరమై, హీరోపలకాంతిపూరహృద్యము గనుమై
సారసుధానిలయంబై, పారావారంబు భాతి భాసిలు నటి మధురన్. ౩

క. అర్థసమృద్ధంబై శ్రీ, వర్ధనచతురాన్యహర్షవర్ధనపరమై
వర్ధిల్లుగీత మన గృహ, మర్థాధిపసౌధసదృశ మగ్గేహములన్. ౪

గీ. ప్రాప్తమండన మచ్యుతప్రాప్తిపదము, సుప్రసన్నసుసంపూర్ణసులలితము
వీణసాదృశ్య మలరారి వేష్ట నెఱపి, యచ్యుతాంబాంబుజిత్రమా నలరుశయ్య.

క. చారుమహాభోగంబై, భూరిశిరోరత్నకాంతిపూరావృతమై
తోరంపుశేషశయ్యం, గేరెను సుకుమారపుష్పకీలితశయ్యన్. ౬

క. వసియించె వాసుదేవుఁడు, ముసిముసినగుమోముఁ దమ్మిమొగ్గయుఁ బ్రసాదం
బసదృశకాంతావిషయ, ప్రసక్తత్వాభిమానబంధవటించుచుండెను కన్. ౭

చ. అతికఠినంబులౌ జగతి హాటకరత్నములంగ నెట్టి నీ
దతిమృదు వెట్లు పొందెనఁగ నైన సమంబటు లేవి భూషణా
వృతి కిది వేళ యౌనటం గి *వేగసమాసవిభూషణావళుల్
సతి ఘటియించు మంచు రవిజాత విభూషితఁ జేసి రంగనల్. ౮

శా. సారోదాత్తవిశేషచిత్రకటభూషాకీర్తి సత్వ †గ్గుణో
దారవ్యక్తి ‡సువృత్తి దోషరహితో ద్యద్వర్ణనోల్లసన §న్నాయకన్
నీరేజేక్షణఁ గావ్యలక్ష్మిబలె (1)మున్నిద్రాశ్రితాస్యాబ్జఁ గా
మారుం డప్పుడు చూచి రోసి పదలేమ మన్నించె కాంతామణుల్. ౯

క. (స)తియంగంబులఁ బొంగడఁగు, నతులప్రాజ్ఞావళీసముంచితవాచా
గతుల ద్వితీయతృతీయప్రతిభటరహితసుటలంకరణ(ర)యుగ(2)మొనసెన్.

---

* వేగసమాసభూషణా † గుణాదారా- ‡సువృత్తి- § న్నాయికిన్
(1) మున్నిద్రా-, (2) మొనసెన్-

చ. చెలులకుఁ దిప్రయత్న మొ(గ)జిమ్ముచుఁ గమ్మనివింటివానిపూ
ములుకుల *క్రొవ్వడంపుఁచు(ను) ముప్పిరిఁగొన్న ననురాగగర్వమున్
నిలువ(వ)దల్చుచుం జెలువ నిల్చెను నొక్కఁడు గొక్కకుండ విం
తలు భళిరా భళీర మదిఁ దాఁక్రొను సిగ్గుపటుత్వవైఖరుల్. ౧౧

గీ. మదనుఁ డను కర్ణధారకుండు గదియుఁ నేని, ప్రియుఁ మనుడి యను నావ శోభిల్లునేని
వేకరంబుల నెరదొరకబ్ధి యేని, చెలువ దాఁటంగ లేదయ్యె సిగ్గుకడలి. ౧౨

చ. వెనుకకు సిగ్గులాగఁ దమివేగము ముందఱ కీడ్వ నవ్వ్యథం
జనుని సహింప †భావమును సంధిలు మధ్యమభావ మైనచో
ఘనకుచ‡భారధారణము గాఁ జనదంచు వదింపవచ్చునే
ఘనపదమాశ్రయించి కలకాలము §చుంబడి వాని గానమే. ౧౩

క. వెనవింటిజోదు విరివి, గ్గునుసుపసం జేయఁ జేయ గుబగుచ లొక్కా
క్కనుఁ గామదశం గడచినఁ, గడుదూరం బయ్యె లజ్జగరిమం బెంతో. ౧౪

చ. అలవలరాజు వైదలి రమాధిపు(కజ్జకు) వేగఁ (1)జేర్పఁగా
వలనుదలిర్ప నూఱటలఁ బాయుచు గుప్పెడుఁ బువ్వబాణముల్
చలనము లేనికూర్మి నవసంబయి మించినలజ్జ జాఱఁగాఁ
గలఁగుచు మోము వాంచెఁ గడుఁ గ్రమ్మను సిగ్గున సిగ్గులాఁడి (2)తాన్ ౧౫

చ. చెలి తలవాంచి తెల్పె బలుచెల్వపుఁ గ్రొమ్ముడిఁ జిమ్ముచీఁకటిం
గలసి మెలంగు పాపటచొకాటపుఁ జెంద్రపురేఖ చే మనో
మిళదనురాగవైభవము మించఁగఁజాలదు లజ్జ నెమ్మెయిం
గలుగఁగ నేర్చు సత్వరితగామిత యంఘ్రుల కెన్నడం చొగిన్. ౧౬

వ. అప్పుడొక్క చెలికలువకంటి యక్కలికి నుద్దేశించి (యి ట్లనియె.) ౧౭

ఉ. క్రొత్తగఁ బ్రాణనాయకునిఁ గూడఁగ నేగెడు వన్నెలాఁడికిం
గ్రొత్తయె లజ్జ లోఁగొనుట కూర్మిచెలుల్ గడితేర్ప జేనికిం
జిత్తము రంజిలంగఁ దగఁ జేయుట యిట్టి విచిత్రలజ్జ మే
మెత్తఱినైన విన్నయది యే కను లెక్కడిమాట ముగ్ధలీ. ౧౮

వ. మఱియు నొక్కయింతి యక్కాంత కిట్లనియె. ౧౯

క. ఇటువంటి ముద్దరాండ్రే, పటుతరకుచకుంభవజ్రకంజరసీమన్
ఘటియింతురు కజలీలల, నిటునటుఁ జననీక జీవితేశ్వరశుకముల్. ౨౦

(*) ద్రొవ్వ. † భావము- ‡ భావధారణ. § చండెసి. (1) జెప్పగా- (2) తొగ

వ. వెండియు నొక్క తేటచెక్కులాఁడి యచ్చకృష్ణవిభ్రాన్త కిట్లనియె ౨౧
క. నను నైవపూలపాన్పున, మనసూఁకుచు నున్నవాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమృదుత్వము, మనమున నీ కెట్లు లేదు మంజులవాణీ ౨౨
వ. పిదప నొక్క బింబాధర యయ్యిందుబింబాస్య కిట్లనియె. ౨౩
క. హరిఁ గూడక క్షణ మైనం, బరియింపఁగరాదు మేన బ్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు నప్పుడు, దరియఁ(నక) యిట్టిలజ్జ దా నెటు చనునో. ౨౪
వ. మఱియు నొక్క ప్రౌఢ యబ్బేడిసకంటి కిట్లనియె ౨౫
ఉ. అక్కరొ నీవు నీమగఁ(డౌఁదపు)డొంటున నచ్చిరీతి నీ
వొప్పులఁ గుప్పచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గం
పొప్పెడు నీదు మోవి దశనోదితరాగ మతండు సేయఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యెందుఁ బోవునో. ౨౬
వ. అంత నొక్క నిక్కులాడి యచ్చక్కఁదనాలకుప్ప కిట్లనియె. ౨౭
మ. ఈకులలజ్జాధర*గహ్వరంబునను రాగోద్వృత్తి కీవేల దా
పరముం జేసెను మర్మముం దెలియు మాపజ్జ వృథాగాదె యె
వ్వరికైనం గనఁ దేటఁ జెందు మదిలోఁ బాటిల్లురాగంబు శ్రీ
కరవక్త్రాంబుజరాగవాసకమహాకర్ణేజపం బంకేటక. ౨౮
వ అనంతరంబ యొక్క పృథునితంబ యాకాదంబగమన కిట్లనియె. ౨౯
ఉ. ఇంతచలంబు సేయుఫలమే మని చెప్పినఁ గాక సేసె దో
కాంతరొ కట్టివాయి యని కాంతుని నెమ్మదిఁ దోఁచునమ్మ శ్రీ
కాంతుని కొండలో కలరు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్కవే. ౩౦
వ. తరువాత నొక్క యుగ్మలి యక్కోమలి కిట్లనియె. ౩౧
క. అతినిబిడలజ్జ గాదిది, సతికి న్మదిలోన నువిద సంగమవేళం
గృతములకుఁ బ్రతికృతంబుల, నితరవ్యాపార మెడసి యెన్నఁగఁ జొచ్చెన్.
ఉ. అత్తఱి నీలవేణి నగ†వాఁగుచు నచ్చెలులన్ నడించి యో
చిత్తజుమల్లి కల్లి విను చిత్తము నిల్పుచు నాదువిన్నపం
బిత్తఱి నాలసింపవల దెంతయుఁ బ్రొద్దు ఘనంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొప్పుగఁ నెంతయు నంచుఁ బల్కఁగన్.

---

* గహ్వరము=నెపము. †వానుచు.

మ. లలనామన్మథ*మూర్తిదృష్టి విరసద్రాగావగావేగసం
†కలనాదీర్ఘదపత్రపాధురి నెమ్మగ్నా‡పేఁ దితభ్రాంతిచేఁ
బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మెల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్ద్విజాధిరాజకమణిస్తంభంబు నండం గొనన్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాంగునఁ గౌఁగిలింతు నే ననుక్రియ న
బ్బాలిక కౌఁగిటఁ జేర్చెను, నీలస్తంభంబు సిగ్గు నెరయం గ్రమ్మన్. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సఖీజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి ముందట నిలిచిన నీలవేణీనీలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసను గ్రకరనందవాసుందరేందు రేఖావిలాసనముల్లాసబలప్రబ(ల)విధవదంతరామోదజఁ ధిఫేనాయమానం బగుమందస్మితంబు ముఖాంబుజంబు నలంకరింప నిట్లనియె. ౩౬

క. చెలి వార్తలేమి? దేవర, కలిగిన భాగ్యమున మనసు కడురంజిల్లన్
జలజాతనయన మిముఁ గన, వలయుచు వచ్చుటయ కాని వార్తలు గలవే.

క. అలికుంతల తుణదాముఖి, మలులితతిమిరంబు గ్రమ్మె నదియేమి? హరీ
తెలివిం గొను కృష్ణపక్షము, వలఁగొను నీక్షణదముఖము వదలు నెతమమున్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాకు రంగనయనప్రౌఢిమకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూషణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందఱకు నిడి వెడలి చను సంజ్ఞ నవతరింపం జేయఁ జాయపట్టికి నీచట్టబట్టినదొర వంపువెట్టినవను లకుం జనిమొద మమ్మరో తిరిగి వచ్చెద మిచ్చట నుండు మని మరుంగుగాఁ బల్కి యచ్చెలులకలకొలుకు లొక్కింత వెడల ననంతరంబ— ౩౯

మ. చతురోక్తి ప్రవిలాసవైఖరుల నంచద్రూప్యాలు సర్తిల్ల ల
జ్జితసంవిస్మితకాంతముఖ్యలలితశ్రీవీక్షణాళీసితా
సితపంకేరుహమాలికన్ మదనకౌక్షేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి ఠేవి కొనఁగెన్ సేవార్థ్మమా కాముకన్. ౪౦

ఉ. కామిత మేమియు న్మనసు గాంచనియట్టియవాప్తకాముఁ డ
క్కామునితండ్రిఁ గామునిచొకాటపుబాణము భామ చూచు చెం

---

* యత్న † కలనందిగ్ధపదత్రపా. ‡ నిందితభ్రాంతి.

తే మదిఁబుట్టువీరునియుదీర్ణపరాక్రమ మెచ్చ నిచ్చెఁ బో
రామికి నూసుడెంగటఁ బరాజయ మొందుట నీతియేకదా. ౪౧

క. హృదయగ్రంధి(వి)భేదము, మొదలంటఁగఁ జేయుబోధమార్తికి నపుడా
మదవతిహస్తగ్రంధిక్, వదలించు టతిప్రయాసభాసిత మయ్యెన్. ౪౨

చ. కరమణికంకణధ్వనులు కామధనుర్గుణపక్వణంబుతోఁ
గరము ఘటిల్లఁ గెల్పుకి నొకానొకయత్నమున న్వదల్చి శ్రీ
హరి హరిమధ్య వంకతల మ౦దఁ నొనర్పఁగఁ గాంత రాజిలెన్
హరిమణినీలవేదిఁ దొలఁకారెడు పుత్తడిబొమ్మయో యనన్. ౪౩

క. చెలికీలుగంట మెలగెడు, నలినాక్షువిమృగుల పాణినఖరుచి రాజుల్
కిలకిలనవ్వఁ దొడంగెం, బాలుపూరెడు మేల్మిపయిఁడిపువ్వులనరుఁ న్. ౪౪

వ. అప్పు డప్పురుషోత్తముండు మదనలీలారహస్యప్రతిపాదనకృతు లగుకృతుల నిరర్థకతాదోషంబు నిజానుస్థానమహిమంబున నపనయింప నవధరించి యమ్మించుఁబోఁడి కిట్లనియె. ౪౫

ఉ. కన్నది కన్నోకండు మఱి కన్నొకఁ డందపునీదుమోముచె
త్తెన్నఁగఁ గొన్న దీదృశదృగీహితవై యలరారు టబ్రమే
సన్నుతగాత్రి నిన్నఖిలసద్గుణసంపద ముజ్జగంబులో
నన్నులమిన్నయంచు విబుధాళి ముదంబున నొలలాడఁగన్. ౪౬

గీ. మానవతి నీవు శృంగారమయత రసిక, చిత్తమెంతయు నలరఁ జేసెదవు గాన
నీకలంకార్యత ఘటించ నేర దెట్లు, భాసురైతావళీయు ఖాభరణగణము.

గీ. భూషణంబంగితభరించెభూష్యమగుట, భూషణతఁ గాంచియంగతబూననగుని
అర్థములు భావశబలతాద్యములు వాని, కాంతరచియింప వేయలంకారములుగ.

ఉ. నేరుపుమీఱఁ గన్నుఁగవ నీటగు కొప్పునఁ గప్పు పూని శృం
గారము నీదురూపుగొని గారవమొప్పఁగ నన్భజింపఁగాఁ
జేరఁగవచ్చెనో తనదుసేవకభావము నాదుసేవ్యతక్
ధారుణి సుప్రసిద్ధముగఁ దా నొనరింపఁదలంచి నెచ్చెలీ. ౪౭

గీ. ఉవిద తావకసుగుణాదియోగమహిమ, వానవాత్మక మగురతిభావమిపుడు
రసతఁ గైకొనె నీకు నీక్రమము కాన, వ్యక్తికతుంబ మనకు సిద్ధాంత మరయ.

ఉ. నేత్రము పర్వసంతటన నెమ్మి యొసంగెడు సాష్ఠవంబుగా
సూత్రితరీతి నంగములు చొప్పడుపాత్రత నీకుఁ గల్గదే

చ. నెల యిది దైన నక్షత్రమాలిరజములు లెక్కసిల్లునట్లు దా
నెలయు రసా(ంబు)రాణి పడి నెక్కసకంబు కరుమాంబు గానిచో
గలిగడు నేకొనక భ్రమ సకలములనంగలి దప్పిరాయెనచో
విలసన మొల్లురేయి నారి దిశగు నంళయు మింతి తీర్పవే. ౭౫

ఉ. పీనులయుం దం(లం)కృతిగ కెట్టినసీలపయోజపత్రముల్
ఖానుతనూజ నీయసిలభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుబ్బులకాంతి భరించు నన్నమూ
టానగరా దొరికెముకదను నానగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి దైవ మొగము దోచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నెలఁ బ్రసిద్ధిగఁ గ్రోలుచునుండు పుల్లుతై
పాయకనిల్చు మోము నవపద్మముగాఁగ నదెట్టులౌచు నీ
యాయతనేత్రముల్ మెలఁగు నౌర కుఖాత్మవిచిత్రవైఖరుల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరవిందమ్మున మోముఁజంద్రునండ మెలఁగుచున్
సురుచిరసీలపయోరుహ, సరసిరుహైకత్వజన్మనగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁజెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రత్సద్యపద్మలాలిత్యంబు పటిమదక్కఁ
జంద్రాతపాస్వాదనమ్మోదమాద్యచ్చకోరవిలాసంబు కొదవగాంచ
మకరందరసపానమత్తమధువ్రతపోతలావణ్యంబు పొలుపుఁదొలఁగ
సరి మొగంబెత్తి చూడవే నీటులాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గువడు వేళ దప్పవే సిగ్గులాఁడి, సన్నమున్నింపవఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓవరిపూర్ణచంద్రనిజరోజ్జ్వలవక్త్రశశాంకబింబ నా
చూపుల పేరుగొన్న హరిపద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంఛదె మోము నర్థినం
తాపము వాప నుంచదశఁ దక్కువె చంద్రుడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి*వేగుగాంచు,కన్నులకునివ్వడుం జెడుకమలములకు
సాటిఁజెప్పంగనమరునేసాటియగును, నెలకునలరెడుజలజంబుగలిగెనేని. ౮౧

మ. అరవిందద్వైపనుఁ దొంటికన్న †నజేయానందంబు గైకొన్న నీ
వరనేత్రంబుల కెట్లు పాటి యనఁగా వచ్చున్ (న)సంకోచతన్

* వేను † నెరియానందంబు.

పరసత్వంబుఁ దొరంగి చూడ పెగ్గై నత్త్రాంతికిన్ దూరమై
ధరలో నుండెడు వారిజోత్పలములం దన్వీ జగన్మోహినీ. ౮౨

క. విలసనమహిమం బెంతే కలిగియుఁ దమ్మట్టుఁ దిరిగి కలయుఁ జతుర్విమం
బలపడమి దూర్యశోభము జలమై హైమాదు నీదుచక్షుర్యుగమున్. ౮౩

గీ. మగువ నీవు దృగుత్పలమాలయందు
మీలనాలంకృ(తి)యొనర్ప మెఱుఁగు గాను
రూపఫలహేతువులఁ జాల రుచికరంబు
మిగుల నుత్ప్రేక్షఁ గావింపు సొగసులాఁడి. ౮౪

ఉ. అప్పతరంగల * న్నిగుల నప్పుడుఁ దప్పదు కోప మించు నీ
విప్పుడు చూపు చాలుకొనసీక పెనంగెదొ యట్టులైన నో
యొప్పులకుప్ప కొప్పజగియొప్పఁదనంబునఁ జాయ మాయఁగాఁ
దప్పక సేయు నప్పుమదిఁ దప్పదితోఁచు పెఱుంగవైతివే. ౮౫

చ. చెలువరొ సర్వలోకములచేతులమోడ్పులు గంటిఁగాని నేఁ
గలనయినం గరాబ్జములు గట్టిగ మోడ్చు పెఱుంగ నేటికిం
పలపలగన్ను వేచెలి(యుఁ)బాయుచు †నన్నుఁ గృతార్థుఁ జేయు మం
చలికులవేణి సిగ్గుపడు నంజలి సేసెనఁ జక్కఁ జూడవే. ౮౬

ఉ. ఎట్టివిశిష్టదేశమున నీసుక యెంతటికాల మెట్టినో
మట్టిటుఁగా కొనర్చుచుఁ గృతార్థతఁ జెందెనొ నీదు మోవితోఁ
జుట్టరికంబు సేయునతిసుందరపంజరశద్వ్రాగముం
గట్టిగ దొండపండనుచుఁ గ్రక్కున ముక్కున‡నొక్కుఁ జూచితే. ౮౭

ఉ. వీనులభూషణం బగునవీనమృదూత్పలముల్ కటాక్షదృ
గ్లీనము లయ్యె వాని కవిగీతము శ్రుత్యవతంసభావముల్
గానఁ దదంతరాయఘటకత్వగ్లో§మయుక్తము కన్నదోయికిం
బూనిక తెప్పలెత్తి ననుఁ బొందుగఁ జూడుము సుందరీమణీ. ౮౮

ఉ. కన్నుల క్రేవఁ గన్గొనఁగఁ గారణ మేమి కటాక్షవీక్షణా
ఖన్నమహేంద్రనీలమణికీలితమాలికలన్ శ్రవఃపుటా
సన్నగభీరకూపములఁ జాలఁగ నించుచు వానిమీఁదుగాఁ
జెన్నగ నేగి ముచ్చిలికిఁ జేరుటకై జతనంబు పూనెనో. ౮౯

---

* న్మిగులు † పమ్ము ‡ నొక్కు § మయుక్తమ

గీ. వనితయరగన్నుఁ గైకొనిను(న)సు దెలియ, నాత్త భావించెదో యట్టియాత్మ నీదు
తనము బ్రిసాకారతనుభరించి, చాతుమంబా కుండెనుఁ జక్కఁగాను ౯౧
గీ. నాతి ప్రకృతాత్తతాప్త ధాకత్వమునయ, నత్తి వద్దంబు పవికణాన్వాయిత్వ
మేలదయసేయఁదలఁచవు హేతువేమి, గర్భసావృశ్యముబ్బి నకతనని టులో ౯౨
ఉ. చక్కెరమాడ్పులు లివి చక్కెర రూపినయంత మెక్కి యీ
చక్కి మఱొక్కమాట వినసంగతిగాని తెలుంగు గా రొదల్
మిక్కిలిఁ జేయుచున్న యవి మిన్నక యుండెనునట్లుగాఁగ నో
చక్కెరబొమ్మ చక్కెరకుఁ జక్కెరయామృదులోక్తిఁ బల్లవే. ౯౨
క. నెలయందురు తామరయని, వలుకుదు రీమోముబుధులు భవ్యామృతముం
చిలుకఁగరాదె మరందము, గులుకఁగవలదే బుధోక్తిఁ గుఱుచవఱిచెదే ౯౩
క. చిక్కను నాదగుభావము, నిక్కముగా నరచితంపు నెఱివల్లులకుం
జక్కని చెలిరో యివ్వడు, చిక్కెడు నీమధురవచనశృంగారములన్. ౯౪
క. రాలుగరఁగించు నేరుపు, చాలఁగ నాకబ్బు ననెడు చందురుగర్వం
*బేలా చెల్లింపఁదలఁతు, రాలెల్లం గరఁగఁ బాట రహింపఁగదే. ౯౫
క. రూపవతి మానుకన్నుతి, కూపంబుల నమృతవృష్టిఁ గురియఁగరాదే
రూపింప నీవదనం, బేపారెను పూర్ణచంద్రుఁడే నిజమయినన్. ౯౬
చ. పరువము లొంచు నీరసతవట్టయి †చెక్కులఁ డంకరించి ని
ర్భరవహనక్షమాన్వదతఁ బాటిలురత్నమరూపకుండలా
భరణములేల వీనులకుఁ బంకజబంధునికూర్చివట్టి నీ
సరసమృదూక్తి భూషణము చాలు నలంకృతిగాఁగ వీనులన్. ౯౭
క. శృంగారవతి కుచద్వయి, సంగత మగురీతిఁ బల్కు సంగతము దగున్
భృంగాలక నిలువెల్లను, బంగారం బైన మాట బంగారమఁటే ౯౮
గీ. అరిదిమాధుర్యము త్తరోత్తరముగాఁగ, వస్తువుల నెన్నఁ బంచవిప్రాథమలమరు
సార‡భూమకుఁదన్వి మెచ్చుటను నీను, మధురసూక్తికిఁబయి నెన్నఁ బ్రథమమన్న. ౯౯
క. ప్రకృతిన్వికృతిన్మాల, ప్రకృతి న్నికవిత చిత్రపద మగు ననుచుం
బ్రకృతి న్వికృతి న్మాల, ప్రకృతి న్నిరసించువారు వలుకుదు రింతీ. ౧౦౦
గీ. వనజలోచన నాదుగాయనత కొప్పి, యమళ్లవై పాటపాడెదో యబ్బ మొదవఁ
దరుణి నాగాయనతనమ్మతంబుగాక, కొదవెఱుంగ కరూగ వయ్యెదవా చెపుమ.

* బేలచలింపందలచెదు † చెక్కులలంకరించి ‡ భూమన్న

క. చంచలనయనా చంచల, చంచు*వీణాధరించి చతురతచే వా
యించెదవో ధ్రువవీణ భ, రించెదవో తెలుపు మాదరించి కృశాంగీ. ౧౦౨
గీ. శ్రుతిపుటంబుల కమృతంపుసోన లెనఁగ, మానసాంభోజ మభినవమాకరంద
మాధురుల దేల నీవేళ సాధుకీరి, దేటగీతి పఠించవే తేఁటికంటి. ౧౦౩
క. నాలుగువిధముల నభినయ, లీలలు నీ కింపుఁ దెలివి లే దన వశమా
యాలోలనయనయుష్మా, పోలినయభినయము దెలుపు†ప్రోద్దుచనుటకున్
గీ. కలువకంటుక‡కిన్నరకంఠిపవనము, యోగరూఢత నీయందు నొనరఁబూను
ననుచు జనులాడుకొనవిందు సదిజంబొ, కాదొ తెలియఁగనగుఁ జాటకలనమాకు.
మ. అతిరక్తాధరసన్నిధానమున నాసాగ్రస్థముక్తాఫలం
బతిశుద్ధం బతిరక్తమయ్యె నిది యన్యాయం బుపేక్షింప నీ
వతులజ్ఞాననిధానమూర్తివిగదా యబ్జాక్షి మందస్మిత
ద్యుతిమాత్రంబున దానిదోష మెడయం దోలం గటాక్షింపవే. ౧౦౬
గీ. ముదిత నీముక్కు ముక్తాముత్యమునకు, నాత్మశుద్ధగుణప్రాప్తి నగుసతద్గు
ణంబు రూపింప నన్యగుణంబుఁ గొనఁగఁ, దద్గుణంబుఘటిల్లుఁ జిత్రంబు కంటె.
గీ. జ్ఞానదీపంబున నవిద్య ననఁగ శుద్ధ, మాత్మరూపంబు దీపించు ననువుదోఁప
వెలఁదినీనవ్వు ననుఁగెంపువిచ్చిపోవ, గానవగుము త్తియముశుద్ధభానమగుచు.
గీ. వికసదంభోజపూర్ణేందువిధముఁ దెలుపు, ముద్దునిద్దంపునీనెఱిమోమునందుఁ
జిఱుతనవ్వైన నిఁక నేమిచెప్పవచ్చు, మధురసామృతవిభ్రాంతి మాన దింతి.
మ. తెలియక మోము వాంచుకొని తేటలనవ్వులు దేరనీక యా
వలనున నున్నఁ జంద్రముఁడు వారిజతుల్యముగాన మోము గే
వలముగ వాంచియుండెఁ దనవాసియు గల్గుమొగంబు వెన్నెలల్
‡సిలుకకయుండునే యని హసింపఁ దలంపులు నింపఁడా చెలీ. ౧౧౦
క. ఈమాడ్కిఁ బలికి యాదవ, సోముఁడు లేనవ్వు పూర్ణసోముని నవ్వన్
భామామణి నెఱసొగసుల, మోమునఁ జెలువారఁ దనదుమోము ఘటించెన్.
క. నెల నెలయు(ను) వెన్నెల వె, న్నెలయును నెత్తమ్మి తమ్మినీటునఁ గదియం
గలసొగసుఁ జూడఁ గలువల, ములుకులవిలు కానికపుడు ముచ్చట యయ్యెన్.
గీ. అజ్జగద్గురునుపదేశయత్నమహిమ, భావమున నించుప్రేమానుబంధపటిమ
హరిణలోచన తాదృశాత్యంతలజ్జ, విప్పుచూపఁగసాగె నవిద్య పోల్చి. ౧౧౩

* వీణాకు - † ప్రొద్దుచ్చుటకును ‡ కిన్నరకంటి ‡ సిలుగక.

క. పంకజముఖి కనుకాటుక, పంకజలోచనుని మోవి పయి నవ్వేళం
బొంకమయి కనఁగనొప్పెన్, మంకెనవిరిమీఁద మెలఁగుమధుప మనంగన్.
గీ. సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పు నందె నపుడు
సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పు నందు టరుదె.
గీ. అబ్జహితనందనామణి యనుభవింప, మురుఁడు మాధుర్యరసముంచి మపి నిజాంక
ముద్ర యిడి నిల్ప రాజిల్లు విద్రుమంపు, వాళమననొప్పెఁ గాటుకనలుపు మోవి.
ఉ. కాటుకకప్పు మోవిజిగి గాదిలినవ్వుమ బొత్తుఁగూడుచుం
గైటభదైత్యవైరిముఖకంజమునం దనరారెఁ జూడఁగా
*మరాటికి సాటియైన రసముఖ్యము లాదిమశోణశుభ్రముల్
మేటిప్రబంధరాజమున మేళన మంది మెలంగునైపడిన్. ౧౨౮
మ. తొలుత న్నందుని యింటిలో మెలఁగి నీతోఁబుట్టు కాళిందితీ
రలసత్కాననభూమి గోగణము సంరక్షించి తీమీఁద నీ
వలచుం జెక్కిటఁ గేళిపత్రమకరీవారంబు పాలించెదం
గలకాలంబును శౌరి పాల్యమె కనంగా నోఁచితిం గోమలీ. ౧౨౯
గీ. భవ్యగండద్వయికిఁ గేళిపత్రములకుఁ, బొందుఁ గొనఁగూడ దన్యోన్యభూషణంబు
పుట్టుమొదలుగ బలుగండములకు నోఁచు, నట్టియవిభూషణతకర్హ మనఁగ నగునె
గీ. అతులవాసన నచలభావానుభూతి, ననమమార్దవగుణమున నప్రతీత
తాళతళ్యంబుచేఁ గదా తరళనయన, కలిగె నీచెక్కులకుఁ జంద్రఖండసంజ్ఞ.
గీ. అసితపక్ష†లగత్తుహినాంశుఖండ, తుల యొసంగిన నమృతంబు దొలుకవలదె
కలిమి లేములు దెలియంగవలయు మాకు, ననుచుఁ జెక్కిలినొక్కె శ్రీహరి ముదమున.
గీ. మించుటద్దంబు నీచెక్కు మించునంచు, నంచుకొనవిందు నదినిజమంచు నెంతు
నిందుబింబాస్యనామొగంబిచట నిలుప, నమలినచ్ఛాయ ప్రతిబింబమయ్యెనేని.
గీ. ప్రకటదర్పణరుచిరేందుశకలములకు, నుపిదనీచెక్కుల(కుఁ)బోనరుత్త్వమనుచు
బుధులుపల్కుదురిటదోషబుద్ధివలదు, శాస్త్రమరయంగ విస్మయస్థానమగుట.
చ. నిటలతటంబునన్ మెలఁగు నిద్దపుఁగస్తురిచుక్క‡బొట్టులోఁ
గటికికలంక మౌననుచుఁ గ్రమ్మితిఁ జుంబనవాంఛ నంశయం
బటమటమే కలంకపద మంచితలక్షణమే వచింపఁగాఁ
గుటిలవినీలకేశి యని కూర్మి నొనర్చెను జుంబనం బటన్. ౧౩౩

*మరాటకుబాటరైన †గళస్తుహినాంశు ‡బొట్టు

క. *హాయదు సంహాస్ఫురణముఁ, బాయ ననంకాశరూపభావాస్పదతన్
†వీడునువు మంగ. మహా, శ్రీయనసత్రోక్తి యమరెఁ జెలి వీనులకున్.

ఉ. ఇంచుక యేని లీలఁ గొన దీకలఁ వీనున కేఁగుదెంచి నీ
యంచితనేత్రముల్ దలుసు సంతికకర్ణముహాధుసన్నిధిం
బొంచెను భీతిఁ గూపములఁ బొందవు నేత్రము లంచు మీఁలస్త్ర
క్షిప్తించినవాని కట్టిభయకీర్తన మొనర్చిన కాచె నత్తృవన్. ౧౩౫

ఉ. కర్ణవతంసనామ మిటఁ గాంచెద దృక్ప్రభ నంచు విచ్చి యా
భ్యర్ణము సేరెఁ గావలయు నద్దిర యాయసితోత్పలంబు దృ
గ్వర్ణపరఁపరాంతరధివాసతఁ గైకొని లీన మయ్యె ని
క్షర్ణమునందు భూషణ(త) గైకొను నేకరణిం గృశోదరీ. ౧౩౬

గీ. కర్ణమునఁ గల్వకనుచాయఁ గప్పుకొనఁగ, మీలితంబయ్యెఁ గంటి పేలాలితాంగి
యింతిసామాన్య మిచ్చట నేలకలుగు, మహితధర్మవిశేషసంబంధ మెడయ.

గీ. బ్రహ్మమనవొప్ప శ్రుత్యంతలక్ష్యమగుచుఁ, దనరు నిక్కల్వ శ్రుత్యవతంస మగుచు
నుపనిషద్రీతి నిది మన కొప్పఁ బలుకు, వేత్తృవేద్యంబులకు భేదవిదళనంబు.

గీ. తన్వి యాకల్వ శ్రుత్యవతంస మగుచు, నాత్మరూపంబు లక్షింప నసుచితంబు
ఇచట రూపంబు లక్ష్యత నెనయ దెట్లు, దృష్టివిక్షేపమున నది తేటపడదు.

చ. కలువలు వీనుల న్మెలఁగఁ గారణ మేమి విభూషణంబుగాఁ
బలుకఁగ సాహసంబు గద భావము నీయది యేమి తెల్పవే
తెలిసెను గల్వ కన్నులకుఁ దేటల సాటగునంచుఁ బల్కుచోఁ
దెలివికిఁ దప్పు వారలకుఁ దెల్పఁగఁ జెంతల వాని నుంచితే. ౧౪౦

క. అతినిమ్నశ్రుతికూపం, బతిపూర్తిగ మెలఁగి పైకి నడరుశుచిరసం
బతితీవ్రత వెడలించిన, గతి నున్నది వీనులందుఁ గలువ వోఁచెలువా. ౧౪౧

చ. సురుచిరహీరనీలముల సొంపగు కమ్మలకాంతిధార యే
కరణి వెలుంగుచున్నయదొ కంటివె తామరకంటి శ్రోత్రకూ
పరమణమాధురీరసము పైకిఁ గడంగుచు జాలుసూపె జ
న్యరసముతో వనం దగినొ నం చొగి నంటెను రెండువీనులన్. ౧౪౨

*బాయఁదునఘస్ఫురణము—†యెనయవు

గీ. మృదుతనవికలభావత మెఱసినల్ల, వాదులకు నెల్లఁ బాసమిఁ దగుచునుండు
నీదు కెమ్మోవి యధరాఖ్య లేదు ముఖ్య, వృత్తి విపరీతలక్షణ వెలయు నిఁతిం
గీ. అతివ నీమోవి యవవర్గమగుట కేమి, కారణము గల్గు నది తేటగా నచింపు
మార్గ తెలి వబ్బె నదివరమామృతంబు, గాన పవర్గభావంబు గలుగుటరుదె.
గీ. గరిత బింబోష్ఠియను పేరు గలదునీకు, నచటనుపమానపుచ ం బంధ్రుబి బ
శబ్ద మష్మాటసిద్ధాంతసరణి సారదు, బింబమిది శేషము లుఁ ప్రతిబింబములుగ.
క. మృదుతన్ సత్కృతిరసనన, వదతం దనరారి నత్త్రబంధమ్ముఁ దాఁ
బొదలి యు ను హాసపదతర్, వదలదు చిత్రంబు నీదు వాతెఱ కంతే.
గీ. వెలఁదినీమోవియవవర్గవృత్తిఁగాంచుఁ, బల్లవచ్ఛాయరాగసంపదలఁ బొదలి
హాస్యపద మగుసవవర్గ మబ్బుటరుదు, వల్ల వాకృతి రాగసంపదలు పొదల.
ఉ. ఇంతిరో మోము చంద్రువిమయిత్వము నైఁపనియట్లుఁ గెంపుమో
వంత సుధారసం బనఁగ నర్థ్యవసాయసహిష్ణుతాగుణా
క్రాంతము గాదొ తద్రసము కాదగునో యమృతంబుఁ గొంటి ము
న్నింతిదె నిర్ణయింతు నని యింపుగఁ జేసెను జంబరక్షుతుల్. ౧౪౮
క. కెంపునుమోవి లత్తుక, కెంపు ఘనంబయ్యె మిగులఁ గీల్గొని నెఱడా
లిం పగువిడెమున మిక్కిలి, సొంపెనఁగెను రాగమహిమ సురదక్షుతులన్.
క. నగుచాయల ముకుముత్యము, జిగితోఁ బలుగంట్లు నిండి చెన్నలరారెం
దగు మోముఁజందువలనం. దిగజాఱుచునుండు మేలుదివ్యాన్న మనన్.
క. మృదుపదమై రసవాసన, లొదవి లసత్కావ్య మనఁగ నొప్పెను నధరం
బుదితరసోత్కర్షం బై, ముద మొనఁగెను వ్రణము గుణత మొనయుంగాదో.
క. ఆమూలచుంబితం బై, లేమ రదచ్ఛదము పూర్వరీతి స్నిగులన్
శ్రీమెఱయుఁగ సంస్కార, వ్యామిశ్రితమంగ శార్థ మన సంశయమే. ౧౫౨
క. చ్యుతసంస్కార మపాకృత, మత మనుకృత మగుట దోషమతి యనుచితమే
యతిచిత్రము మృదుపదమై, యతివకుఁబలుఁ దెరయ వాక్యమగుటఁదలంపన్.
ఉ. మంకెనపువ్వుఁదేనియలు మాటికిమాటికిఁ గ్రోలి సొక్కుచున్
శంక యొకింతయుం గొనక శాతరదక్షతముల్ ఘటింప న
వ్వంకకు డాయుఁ గృష్ణమధుపంక్తిబిడె మూదితె నాతి యన్న న
ప్పంకజగంధి మాటుకొనెఁ బంబినభీతిని మోవి కేలునన్. ౧౫౪

క. అలఘువిలాసత గానా, కలితాజరభాంచితత్వగమకతగా నే
వలనువఁ జంపకమాలా, లలితత్వము నీకు నాస లాగెం జెపుమా. ౧౫౫
గీ. సుఖదమరుదంచితస్పర్శశోభితంబు, నవ్యవహితస్ఫురద్రసం బవుతమంబుఁ
గైశికీవృత్తి యన నాన గడు వెలుంగు, నొకనరంధ్రత వదలకయుండుఁగాని.
గీ. మధురిమంబున నీమోవి మధురిమంబు, శంకపడఁజేయ నాసికాచంపకమున
వెడలి మొకురించినిలిచినవిమలమౌక, రందబిందువు నాముత్యమంద మొందె.
క. బిత్తరి నీనేత్రంబులు, ముత్తియపుంజిప్ప లనఁగ ముద్దుగులుకు నీ
ముత్తెము జన్యము గాదా, హత్తినప్రేముమునఁ జూడ నర్హము గాదా.
చ. అని వనజాక్షుఁ డంచితముఖాంబుజహాసమరందపాళితో
మనమున రాగసంపద యమందతఁ జెందఁగఁ జిన్నినవ్వుతోఁ
జెనఁగొని ముత్తియంబు నొకవింతయొయారము దాల్ప నాసనా
ఖని యగునాసపై వదనకంజముఁ జేర్చుచు మాటిమాటికిన్. ౧౫౯
గీ. ఈవిధ మద్బాహుసంవాసయోగ్య మగుటఁ
బ్రతిభటస్ఫూర్తి సైఁపనిప్రభలుగొనుట
వేడ్కఁ గంఠంబుఁ గనఁగ నివ్వేళ నాదు
పాంచజన్యంబు మదిలోనఁ బాదుకొనియె. ౧౬౦
క. సతి నీమకొలికి కుపమే, యత యర్హామె యొక్కభంగి నది యొప్పంగా
నతిమృదుతన్ సుస్వనతన్, వ్యతిరేకం బనుచుఁ బలుకు నది చిత్రంబే.
గీ. కలికికలుగముఃలగుఁగదాకంబువునకు, నాత్మహావప్రబోధంబునందు నెపుడు
గాన జడమగునది యొట్లుగాంచు సాటి, యాత్మరూపప్రబోధంబునందు మెడకు.
గీ. అర్ధనిద్రాన్వితం బగు నౌర కంబు, వతివ నీకంధరకుఁ జాల నలికియలికి
యట్టిదానికినుపమానతాన్వయంబు, గగనకుసుమంబుతో మైత్రి గాంచుసుమ్ము.
ఉ. చుంబితమై రొదల్ నెఱవఁజొచ్చినకంబువు*తోడిసాటి కం
తంబున కందఁజేసెదఁ గటా కట †మచ్చికయూని పల్కుచో
క్షంబుగఁ బల్లఁగాఁ దలఁపుఁగాంచి యకార్యము గాక కార్యమే
కంబువుసాటి కీర్తికరమే యది తీయగఁ బల్కనేర్చునే. ౧౬౪
గీ. సరసిజానన నీకంఠసరణిఁ దెలు(పు), ప్రస్ఫురద్వర్ణమాధుర్యవచనములకు
సాటియగు నెట్లు తతవాద్యజాతరవము, మధురమే నియవర్ణతమానదెపుడు.

---

* తోటిసాటి † మచ్చికయూనిపల్కుచోకంబుగ

క. ఓసరసురాల నిజముగ, నీ *సరసపుఁగోలికి వెసలు నెఱిపలుకులకున్
దోసము సరియన్న రసా, భాసాస్పదశుకపికాదిపక్షిస్వనముల్. ౧౬౬
గీ. తరుణి తలఁప నవస్థచేతనత నుండు, శుకము పికముఘనాగమస్ఫూర్తి నెసయు
మఱియుఁబికమొప్పు త్వద్ధ్వని నెఱి నెసంగు, నీకు గళసూక్తివలెనట్లు నింపుగావు.
ఉ. తావకకంఠనిస్సరదుదంచితభారతి సద్గుణత్వసం
భావితమైన దోషముల భాసిలు దోషగుణత్వదూరతన్
భావుకు లెన్న దోషముల షజ్జమెలంగదు దోషమా గుణం
బేవిధిఁ బూన దిష్టగుణమే కొను నంచు వచింతు రుత్తముల్. ౧౬౮
క. నీరసములు గాన నలం, కారము లివి గావు నీమకరంబునకున్
సా(ర)రసోత్కృష్టగుణా, ధారము లగునువచనములు తగుభూషణముల్.
క. పటుబంధస్ఫురితము లు, త్కటబహురసవస్తుసంవిధానకుముముల్
†త్రుటితాసారా(?)రంధ్రము, లటు సుగుణములు విఘటిల్లునవి గాసొమ్ముల్.
సీ. అనుకరణంబుచే ‡నగృహీతసంస్కారముఖనిత్యదోషసంస్ఫురణ మఱచి
శబ్దతత్త్వార్థవైశారద్యమున శ్రుతికట్వాదిదుష్టత కాకు సేసి
యంగాంగితాకథనాదిసాధనముల రసదోషనిచయంబు రాణఁగుంచి
వ్యక్తవాచ్యార్థప్రబంధౌచితీగతి రచనాద్యనర్హత రహి హసించి
రసికు లౌనవఁ ద్రిప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నాదనంబుఁ
గొంచు నీకంఠమున నిస్సరించునంచు, వినికి నాకగునది కొల్లి కనుపుసొమ్ము.
చ. అని వనితానురాగరసహర్షసముత్కటమానసంబుతో
వనజదళాక్షుఁ డత్యతివబంధుకపేశలకంఠనాళముం
దనముఖపద్మసంగతినిఁ దద్దయు ముద్దుఁదనంబు గుల్కఁగా
ఘనకరివాజ్జసంభరణకౌశలహస్తము మెచ్చెఁ దార్క్ష్యునన్. ౧౭౨
చ. కుచపదమండలంబున నకుంఠసజాతివిజాతిభూషణ
ప్రచయము శ్రీరసీరసయభావముత్రోఁ దిలతంబులక్రియా
ప్రచితము నొచు షద్రసము భాసిలఁజేయుచు దోషవిక్రియా
వచనము దూరమై మెలఁగ వర్తిలుచున్నది కంటివే చెలీ! ౧౭3
సీ. నిరుపమనానామణీచిత్రరుచిరాజి డంబుమీఱిన రోహితంబుగాఁగ
భావనాతీతసల్లావణ్యపూరంబు సౌదామనీలతాచ్ఛాయగాఁగ

---

*సరసులకోలికి †త్రుటితనిస్సారరంధ్రియు- ‡నవిగృహీసంస్కా-

నత్యర్ఘమౌక్తికహారాళి సతతధార పయోబిందుధారగాఁగ
ముక్తాళిమధ్యగనీలహీరములు లసదురువక్షోజములుగాఁగ
లలితరుచివక్త్రశశిమండలంబు దిగువ, దండిమీఱుపయోధరమండలంబు
మా(మ)కమనోరథచ్ఛలమహితసస్య, ఫలములెల్లను మిగుల సిద్ధమ్మనఁగ.

క. ముక్తాహారము లిడ్డవి, వివిక్తచ్ఛాయలు ఘటిల్లి వెలయఁగఁ జేయున్.
ముక్తాపద(?) మన్యమణీ,రిక్తత గన నీసముద్ధరించినకృతులన్. ౧౭౫

గీ. పూర్వపూర్వవిశేషత పొసఁగె నుత్త,రోత్తరంబున కిది భూషణోత్తమంబు
నాతి యేకావళీభూషణంబు దీని,గన్నరసికులమది మోద మెన్నఁ దరమె.

గీ. రమణి! దీపకభూషణరత్న మిద్ది, మంజులైకావళీయోగమహిత మగుట
మాలికాదీపకం బౌచు మామకీన, మానసము నాత్మనిష్ఠతఁ బూనఁజేసె.

క. *అరయ సరసత్వఘుటకం, బురుతరలోజ్జీవితంబు నొప్పగు సుగుణ
స్ఫురణంబున నేకావళి, పరమాలంక్రియలలోనఁ బర్వెందుముఖీ ౧౭౬

చ. సురుచిరపద్మరాగపరిచుంబితనీలనిబద్ధహారని
ర్భరరుచిరాజి వింతకనువందువు సేసెఁ ద్రివేణికైతవం
గర మనురక్తి నేతదవగాహన మొందె మదీయభావ మ
బ్బురమె నిరంతసౌఖ్యరమ పొందుట యిత్తఱిఁ గామినీమణీ. ౧౭౯

గీ. లేమ నెలచాతఁ దారావళికిఁ బ్రకాశ,మబ్బుటరుదని యెంచంగనగు నెచూడఁ
దదురుకోమల నెనసి యుద్ధతపుఁజక్ర,వాకయుగళంబుజోడయివఱలనరుదా.

క. లాలితకుచపదమండల,మాలి నలంక్రియలు చాల నొప్పఁగఁ జేయున్
†బాల పిఙ్ఛింపు మువమూ,మాలనములు పొందుఁగొనుట మెచ్చు తలంపన్

క. ఇక్కరణిఁ బలికి యదుపతి, చక్కనిరవణమునఁ జిక్కు సడలింపుచుఁ జన్
జొక్కపుఁబూగుత్తుల పై, నెక్కొనఁగాఁ జేసెఁ గన్ను నెఱిచుమ్మెదలన్.

క. మించి మహీధరగర్వ ము,డంచుట నిరమిత్రవౌ మిటారికుచంబుల్
కంచుకకవచం బేల ధ,రించెను గాళింది విస్తరించి తెలుపవే. ౧౮౩

ఉ. రంగు లెసంగుమేను మది రాణవహించుదృఢానురక్తిచేఁ
బొంగఁగఁ దద్బలంబునన పుట్టినతత్తనుకంటకంబు లె
క్కం గడుదుర్బలం బగుచుఁ గాంచనకంచుకమిద్ది వక్షుసన్
భంగముఁ జెందెఁ గన్గొను మభంగురలోలకటాక్షవీక్షలన్. ౧౮౪

*అరస †బాలాపిఙ్ఛిం-

ఉ. కొండలనైన లేఁతవిరిగుత్తులకైవడి మీఁట రాజవే
దండము గొండమల్ విరియ నాఁకఁగ దక్షత గల్గి మీఁటి యొం
డొంటిని డాసి యా వెలుఁగఁ గొండడు కోడె మిటారిగుబ్బలో
యండజయాన హస్తగత మయ్యెడు సూత్ర మదెద్ది తెల్పవే. ౧౫
క. పాలిండ్ల మరగి తిరిగి(తి,) హేలావతి(చి)న్న యువ్వ డిప్పుడు నీమే
ల్పాలిఁడ్లు మరగి తిరుగఁగఁ, బాలయితిం గదవె కోర్కె ఫలియింపంగన్
గీ. మగువ ! యేతత్పయోధరమండలంబు
బర్హాధరహృత్ప్రమోదంబు బలియఁ జేసె,
మదిరనేత్ర పయోధరమండలంబు
బర్హిభృన్మోదహేతువై పరఁగు టరుదె. ౧౬
క. గురుశుశ్రూషణ మవనిం, బరమసుఖం బిచ్చు ననుచుఁ బలుకుదురు బుధుల్
గురు(వ)కుచరిశుశ్రూషన్, నిరతిశయసుఖంబు నాకు నెలకొనదె చెలీ
గీ. అడరి ద్విజరాజచక్రంబు డస్సఁ జేసి, మృదులతరసుమనఃపంక్తు లోడఁగఁ జేసి
మిగులనుద్ధతిఁ గొన్న నీ మెఱుఁగుగుబ్బ, మగువ మర్దింపఁగు మాకు మానఁదగునె.
సీ. కుచములు గిరులన్న గొబ్బునఁ బరువత సాదృశ్యహేతువై చాలఁదోఁచు
దోఁచిన మృదుతనూద్భూతకుచంబుల కదియైన వైషమ్య మనెడు శంక
బలుకుచంబులు పూలబంతులైన మృదుత్వ మచ్చటఁ గారణం బనెడు తెలివి
వివరింపనత్తెల్వి విషమతకవకాశ మంబరకుసుమంబ యనెడు మనసు
కేలఁ గైకొని మదిఁ బరీక్షింపఁ దెలియఁ
బరమభావమృదుగ*పద్వర్తులత్వ
పీనతౌన్నత్యములఁ గొన్ని భేదము లిటఁ
గరణములు మాటికని చన్నుఁగవ గ్రహించు. ౧
మ. బలుకొండొక్కటి యున్న నాకరమునన్ బాగైన పూబంతినా
విలసించెం గద మేల్కుచంబు లివి యీ వేళం గరాయత్తత
స్వాలయ స్వార్ధవ మేని తత్సదృశత న్నిర్మింతు నక్కొండ క
స్తలఁ బొల్పన్ జనియించె నంచు హరి మిన్నాగుబ్బ లొత్తుం గడున్.
గీ. అతికఠినపీనవక్షోరుహద్వయీయాలి, మర్దనము చేసి చేసియు మఱియు మఱి
గాంతుఁ డడునాదు మృదుహస్తకంజ మింతి, చిత్ర మిది యని కుచపీడఁ జాలఁగ చే.

*సద్వృత్తత్వ-

సీ. చోసునాయకకూడి జొబ్బిల్లెడు సుగంధభూరిపంకంబున బ్రుంగిబ్రుంగి
కమనీయకుసుమసంగ్రథితకందుకముల నలరులీలల వాడ నాడియాడి
గురుతరమత్తేభకుంభస్థలంబుల నెఱి నాక్రమింపంగ సిక్కి సిక్కి
యమితఘనాత్యున్నతాహార్యరాజంబులఁ దడయ కత్యున్నతి దాఁటిదాఁటి
శ్రమజలం బూర జొమ్మొక్కి చక్కనిలువు
నుచకోరంబులను జూచి సొక్కియాడి
ముద్దు గొన *మనసుబ్బెడు ముదిత యనుచు
ముద్దుఁజనుదోయి శ్రీపతి ముద్దుఁగొనియె. ౨౦౨

సీ. చంద్రుఁ డొక్కఁడు బాధింపఁ జక్రయుగళి
యిందుముఖి నీమనుబ్బెనై యొనసి యిప్పుడు
చూడు బహుచంద్రభూషణస్ఫురిత మయ్యె
ననుచుఁ గుచముల నఖరేఖ లంటఁజేసె ౨౦౩

క. నెల యొక్కఁ డేచ జక్కవ, లలికుంతల నీదుకుచము లై బవిలింపం
గలిగెన్ బహునఖచంద్రా, కలితక్షతిపీడ యని నఖంబులు నాటెన్. ౨౦౪

సర్వగురుచిహ్నములు గానిచన్నదోయి
సర్వగురుభావ మెఱుఁగంగ సత్య మగు నె
యనుచు గోవిందుఁ డానంద మతిశయింప
లీలఁ గుచముల శాలేంద్రరేఖ లిడియె. ౨౦౫

క. హరినఖపదచిహ్నిత మగు, సురుచిరకుచకుంభయుగళి చూడఁగనొప్పెన్
వరశుకశితముఖదారిత, పరిపాకమనోజ్ఞలికుచఫలయుగ మనఁగన్. ౨౦౬

గికులకుఁ జిత్రపత్రలత గీఱ్ఱను టబ్రిమె కప్పురా గోవేఁ
రము మెఱుంగులీనుమృదుగంధ మెలందఁగఁ జేసి కెల్లడా
రులకు సాఁటిదెచ్చి యటఁ గేళివసించు శివుండ నయ్యెదం
కరుణి యటంచు నించు హరి తెక్కుచసీమ సుగంధపత్రముల్, ౨౦౭

పెకము మహాగమాంతరలీఁ జూడ్కికి నింపగు దాడిమీఫలం
గీకట పునర్విదారణము లందెడునట్లు ప్రియుత్నమూనె నా
ఎకము సమందహాసమయి ముద్దులు గుల్కఁగఁ గొమ్మపైఁడిదా
ప్రోకచక్కులూరుపయ్యెదను జక్కఁగఁ గప్పెను అమ్మఁ గ్రక్కునన్. ౨౦౮

*మనసు పుట్టెను.

క. అతిపరుషోన్నతవృత్తిం, బ్రితిలేకుండియును మధురరసమేరితిన్
సతి నీకుచపదమండల, మతిచిత్రము మధ్యవృత్తి యగుచుం జెలుకున్.

క. గేయ మగు చేరగురుతో, న్నేయంబై సర్వవృత్తనిచయాద్యంబై
పాయదు గా శ్రీవృత్త, శ్రీ యీవక్షోజయుగము శృంగారవతీ ౨౧౦

క. పరుషంబు లగుటఁ గుచములు, సరళంబులు గాక యున్న సఖి చిత్రింబే
స్థిరము లగుచున్న వబ్రము, పరమాణుసమానమధ్య పరికింపంగన్. ౨౧౧

క. ఈకుచపదమండలమున, శ్రీకరభావమున మెలఁగు చెలువౌభూషల్
శ్రీకర ముభయశ్లేషమె, కోక స్తని చాలఁజాల గుఱుతుగఁ గంటే. ౨౧౨

చ. మనభిమత(ంపు)శయ్యయయి మానితభూషణమై యదోషమై
ముద మొనరించుఁ గావ్య మన ముద్దుఁగుచద్వయి చిత్రి మొక్కఁడే
సదమలగాత్రి సద్గుణము చాలఁగ సూక్ష్మతఁగాంచియేని దాఁ
గదిసి సారంగ సంధి యటఁ గానఁగ శక్యముగాదుమాఁకగన్. ౨౧౩

క. ఈరీతిఁ గుచము లెన్నుచు, వారిజలోచనుఁడు కాంతవారస్ఫురణా
ధారము లగుదోర్మూలా, కారావారములచాయఁ గనుమీ లడరన్.

చ. చెలి కరపల్లవస్ఫురణఁ జెందినదోర్లతికాలవాలమై
యలరెడుబాహుమూలముల కోర్వము ఖాతము తీవె ఫ్రాంత వే
వెలయఁగ బాగుగా యనుచు వేడ్క నఖంబులనాటెఁ గక్షలన్
విలసదనూనబాహువుల వేమఱు గందపుఁబూఁత దానిరెన్. ౨౧౪

క. ఆకుఁ గనుఁగొనియె శ్రీహరి, యాకుచి ముద మొనరఁ జేయు హారిరత్నపుమే
ల్కేరుం జలిచీనులబెనొక్కౌరుం గలహింపఁ బిలువఁబంపెడుదానిన్. ౨౧౫

గీ. చిన్నకానునఁ బొక్కిటినేల్పుబావి, లేమ యాచెంత మధుకరాలీక్షమగుచు
గలదు సేశలరోమాళికల్పవల్లి, విబుధవరు లగుమా కొగివేడ్కఁ జేయు. ౨౧౬

గీ. అతివ మున్నంత మేనికి నహివరేఖ్యఁ
డభిమతంబైన తల్పమై యలరఁ జేసె
నిపుడు రోమాళిభుజగేంద్రుఁ డీకర్ణాబ్జ
ములకె తా శయ్య యగుచుఁ బల్మొద మొనర్చె. ౨౧౭

క. మాయానరేంద్రహస్త, చ్ఛాయల రోమాళిభుజగచండుఁడు మిగులం
జాయపహించెను జిత్రము, ఛాయాసుత నీకుఁ జూడఁ జనదే చెప్పుమా.

సీ. పరుషబంధమయుం బొటఁ బరఁగుగాఢ, రీతినో లెను జనుదోయి లేమయట్లు
గానరోమావళియును పేరువ్రాసుచీమ, బారుపయి కెక్కు నాభిగహ్వరము వెడలి.

ఉ. ఫోక్కటిరోమనుండి నలుపుంగిరులంచుఁ గుచంబు లంటఁగా
గ్రొక్కిన నిక్కునీలఫణి తా జొకా ఫోక్కటిపాదునుండి పెం
పెక్కఁగ నిక్కుచున్ బయట నెంతయు సుక్కుచు గబ్బిగుబ్బలన్
జొక్కపుఁగొండలం చడరి చొప్పడుతీవెయొ యిద్ది చెప్పవే. ౨౨౧

సీ. రమణి మంజులరుచిరోమ రాజిభుజగి, తరుణికృష్ణభుజా దండదండశూక
రాజు తెనుగూడ నెంతేని రమణఁగాంచెఁ, జూచితేముద్దుఁ దెలితేటచూపులాఁడి.

క. ఆతల నీతల దేశము. లేతత్తైనసన్ సమృద్ధి నెనయఁగ జూమా
పేత మగు మధ్యదేశము, ఖ్యాతిగ నిట నహింభయంబు కలుగుటకతనన్.

క. కాళిందిమధ్యగత మగు, కాలాహి న్నాఁడు హరి మర్దింపం
జాలితిఁ గరసున నిపుడీ, కాళిందీమధ్యగాహిఁ గడఁగితిఁ బెనుపన్ ౨౨౪

క. అండఁగొనువారె భూధర, మండలమును లగుట మిగుల మహిమంబులచే
నుండుకొన మెండు లేమిడి. యండగువారల*నుబీడయంటఁగ సాగెన్. ౨౨౫

సీ. కన్నరే కంటివే నీదుచిన్న నడుము, మిన్నుముట్టినకలిమి చేకొన్న దేని
యెన్న నబ్బుర మిద్ది దానున్న దిక్కు, నెట్టినెఱవాదులకు నేని యెఱుఁగనీదు,

ఉ. ఉరుకుచభూధరంబులకు నొప్పఁగఁ బ్రోకలతానుపత్రిముల్
కరముదలిర్పఁ బొక్కటిచొకాటపుఁబొడ్డనబావిలోని యా
ద్వరసపు జాలనా మిగుల నందముఁ జెందెడు రోమరాజి యుం
చనుడు ఘటిల్లఁగాఁ బొగడు నచ్యుతుఁ డా రొగిఁ గేల నంటుచున్. ౨౨౭

ఉ. విప్పగు నాభిదీర్ఘికను వెల్వడి యీఁదికి వేగఁబాఱు నే
ల్కవ్వరసంపుజాలుగద గట్టిగఁ జొక్కపురోమరాజ యుం
దొప్పగు లేఁదరంగరలర యొద్దగదంతుర రేఖలోక దే
యొప్పులకుప్ప యీవళి లహో యని మాటికి నంటు మువ్వలిన్. ౨౨౮

సీ. కాదు భావంబు దృష్టికిఁ గానరాము, ఘటుకుచద్వయిఁబూన నభావ మొల్లు
నాతియటుగానను భయభిన్నంబుకాను, మత్స్యరూపంబుగనుట చేమాకుషుద్ద

క. సర్వద్రష్టను నేనను, గర్వం బిక మాకుఁగలదె కనుపట్టదుగా
పర్వేందువదన మధ్యము, సర్వపదార్థాంతరాళసంగత మయ్యున్. ౨౩౦

*నవీన నట్టఁగ సాగెన్.

గీ. సత్త్వ మొనగూడకున్నను జాన నడుము, విష్ణుపదపదమయ్యెడు వినుము పిదప
విష్ణుపదపదమయ్యెడు విధము లేదు, సత్త్వ మొనగూడ ననినవ్వెఁ జక్రధరుఁడు.
క. ఘనజఘనకుచపదంబులు, తనరయ్యెను గురువులగుచుఁ గమలదళాక్షీ
కన వింత మధ్యపద మిది, తనుపట్టెను లఘువిలాసఘటితశం బగు మన్. ౨౩౨
సీ. బలుకొప్పుకార్మొగుల్ బాగుగా ధరియించి తులకించువదనచంద్రుని భరించి
గంధిలనిశ్వాసగంధవాహముఁ బూని తనరారుకుచపర్వతంబు లూని
తన్మధ్యసంధానితనభంబు గైకొని పంచభూతమయప్రపంచ మూని
సూక్ష్మాతిసూక్ష్మ మై చూడ్కికిఁ గనఁగాక మాయాభిరామమై మహిమఁ గాంచి
తనమహాకాశపద మొప్పఁ దనరు నడుము
పరమసూక్ష్మత మును విష్ణుపదతఁ గాంచు
నిక్కుడు మద్దేహసంగతి నెనయు మిగుల
విష్ణుపదభావ మని కౌనుఁ బిడికిలించు. ౨౩౩
గీ. వెలఁది లావణ్యరసమహావేణియందు, బంధురావర్తమై స్వర్ణపద్మమయ్యె
వళిగభీరమహాహ్రదంబయ్యె మెలఁగు, వేడ్కఁ గనుఁగొంటివే నీదు వెడఁదనాభి
చ. కలితతనూలతం గలవికస్వరనాభిసుమంబులోపలన్
మెలఁగుచునుండి మీఁదటను మేల్వలపుల్ గులుకం దదుద్భవో
జ్జ్వలకుచగుచ్ఛముల్ గొన నవారణమైఁ బయికెక్కెఁ బిల్లతేఁ
టులజిలిబారునా జగిఁ గడుం దనరారెడు నారుఁ గంటివే. ౨౩౪
గీ. కాంత యేలోకమున నైన గగనకుసుమ
దర్శనము సేయ నొకఁడైన దక్షుఁడగు నె
యిప్పు డీమింటఁ గనుఁగొంటిఁ దప్పుగాదు
చారుభాస్వరవికసదంభోరుహంబు. ౨౩౬
క. శృంగారరసం బిచ్చటఁ, బొంగెడె మధురంపుగుణము పొలుపారఁగనో
యంగన మధ్యమవృత్తికి, సంగెడె మాధుర్యగుణము సంశయ మేలా.
క. ప్రవరుక్తివలెను నుడికిం, గనరయ్యెను నాభి మించు గడురూపమునం
బునరుక్తవదాభాసం, బనఁగ నలంకృతుల నెఱుక నందుట లేదే. ౨౩౭
గీ. పంకజాక్షి యీకరపంకజమ్ము, చొరఁగఁ దలఁచెను దాఁ బరసుఖముఁ గోరి
చెలువుమీఱెడు నిమ్నహాబిలబిలంబు, నన్యకార్యసమాసక్తి యెంత వద

మ. అలమింటన్ సురదీర్ఘికం దెలిగజం *బాహ్యాయకాంచత్కారం
బెలమిం జూచుచుఁ గ్రీడసేయుఁగద కృష్ణేభంబు కొన్నింట నీ
చెలువంపుంబలుడిగ్గియుం బ్రిమదియై చేసాఁచి క్రీడింపఁగాఁ
దలఁచెం జూచితె యంచు నాభికడకుం దార్చెం గరాంభోజమున్. ౨౪౦

మ. హృదయగ్రంథి మహాదృఢం బవుఁగదా యుప్పొంగ్స్య నీక్షింపఁగా
పదల న్నే నొకలక్ష్యమూ యతనికిన్ భావింపఁగా నంబరా
స్పదమా గ్రంథిత నాస్వభావ మనుచుం బాటిల్లుభీతిం గడుం
జెదరె న్నీవి మనోహరాంగి కనుచుం చిత్తంబులో నెన్నదన్. ౨౪౧

క. ముడితోడనె వడిమీఱఁగఁ, గడుసాగెం గటి నెసంగుకనకాంబరమున్
సుడివాలుదాల్పుధైర్యపు, ముడి సాకల్యంబుగాఁగ ముద్దుగ జాఱెన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుం గనినయట్టిమహోత్సవుఁడు రత్నభూషణం
బొత్తు నటంచు నాత్మమృదులోజ్జ్వలచేలచెఱంగు మెత్తనౌ
మెత్తఁగఁ జేసి కందిటను మేలిమిబంగరుఁబోఁడిఁ జేర్పఁగాఁ
గుత్తుక పాంచజన్యమొనగూడినచాయ నొనర్చె నచ్చటన్. ౨౪౩

క. నవ్వుచుఁ బువ్వులతూపుల;గ్రొవ్వుచుఁబుష్పాయుధుండుగువ్వచుఁదిరుగన్
దువ్వుచుఁ గటిపై †జూవులు, రువ్వుచు వెన్నుండు తిగ్మరుచినుతిఁ గనియెన్.

సీ. వివిధరత్నప్రభావిస్ఫురన్మేఖలామాయావిచిత్రిత మనుటకతన
సూత్రాత్మసూక్ష్మత శోభిల్లుకతమున బహుగుణాశ్రితుతచేఁ బరఁగుకతన
సంత(టం) దనురోచు లడరించుకతమున సర్వజనంబున నబ్బుకతన
మాలిన్యలేశంబు మలయనికతమునఁ గటిసువర్ణంచంబు గ్రమ్మకతనఁ
దరుణి మామిత్రి మిమ్మహాంబరము గానఁ
దనకుఁ దా విడి మాకుఁ బ్రీతిం గొనర్చె
మేము చేసినపని గాదు లేమ మాకు
నేర మించుకయును లేదు నీవు గినియ ! ౨౪౫

గీ. భామ కర్ణావతంసాదిపదములందు, జఘనకాంచిసమాసగజఘనపదము
గణితమై యున్నదో కాదొ కలిమి లేమి, నీ వలంకారవరివిగా నిశ్చయింపు

క. విరసంబై కనుపట్టెడు, సురధునిసికతామయంబు జోడనఁ దగునే
పరమాద్భుతనుషమారస,మిరవొందఁగఁ గానమైనయీకటితటికిన్.

*బాహ్యాగకాంచ †మూపులు

దాసఁ గనఁడయ్యె ముని త్వరితంబుగతన
నబ్రమే వార్తికోక్తుల నతఁడు గొనెను.

క. అని యూరుద్వయిపొందిక, కనితరసాధార(ణ)ంబు హర్షము గొనుచుం
గనకపుఁబొల్లియ వేలుపు, కనకాంగిపదద్వయంబు గనుఁగొను చనియెన్

గీ. ఆంతజంఘా(?)లసద్వృత్తియై మెలంగి, లలితవర్గోపరీతుల లక్ష్య మగుచుఁ
దళుకులీనువలంకృతధ్వనులఁ దనరి, రమణి సొగసైన యీపదరచన వెలయు.

గీ. హరికరస్పర్శసంజాతహర్షవిభవ, యతులమృదురూపనీరజాతాధివాస
లక్ష్మి నీపాదములసేవ లాగుచున్న, దింతకన్నను భాగ్య మిం కేమి నీకు

మ. అను చంఘ్రిద్వయదర్శనాగతమహాహర్షంబు లోకాళిక
ల్పనసత్యల్పవిలాసతం గొనునిజస్వాంతంబు నాత్మాశ్రయం
బన కెంతేవడి మీఱి శ్రీధవుఁడు ప్రోత్సాహింబ దగం గౌఁగిటం
జెనయంజేసి కుచాంతరం బురము నాశ్లేషించెఁ జెన్నొందఁగన్. ౬౬౨

చ. అతిసితంపుటగ్రముల నందెడుబల్చనుబొంగరంబు లు
న్నతి మిగులంగఁ దాఁక జిగిఁదప్పమురంబు నురంబు(దాఁ)కినన్
క్షతి యొకయింతలే కడరుచక్రసిగుబ్బలు వెంటిదార్ఢ్యముల్
ప్రతిఁగొన *నొక్కఁడొక్కటికిఁ బాయనిసాక్షులు యుక్తయోగముల్.

గీ. ఘనలసద్వంశములఁబుట్టి జనులొనచ్చు, భిన్నముల కోర్చి శుద్ధవృత్తిదస్పృత్తిఁ
జాలరాణిల్లు మేల్ముత్యసరులువిడుచు, సద్గుణంబుల నుద్ధతాశ్రమముకతన.

గీ. ఆంతరం బగుజార మావంత లేక
బయటఁ దెల్పులు గొన్న యాస్పద మగన్న
నొక్కతటి హాని యగు నని గొప్పఁబలుకు
చతులహా(రా)ళిసూత్రంబు లపుడు విరిసె. ౧౬౫

గీ భిన్నసూత్రంపుముత్యముల్ చేరు వేళ, నవ్యనక్షత్రమాలిన్ను నవ్వఁ గొను
ముత్యములునాభిసరసికి మొన యునపుడు, తతపయోధరగళదుదస్రితములయ్యె

ఉ. కంచుకనామసత్కవచగర్భగతత్వ మఖండసారభా
వాంచితసల్లైనవారలకు నర్హ ముగా దని వీడనాడరే
కొంచెపుఁబూఁత తొడగునె కూడునె కీర్తులు కార్యవేళ నం
చెంచి కుచంబుపూఁత నెడయించె నసం గడువీడెఁ బూఁతయున్ ౨౬౭

---

* నొక్కఁ డొక్కటికి

ఉ. అత్తరళాయతాక్షి యసమాయుధుపూర్వరణంబు శ్రీహృదా
యత్తునిచిత్త మాత్తకుతుకాతిశయంబునఁ జేసె వ్యక్తిగా
ఘాత్తచమత్క్రియం బయి నిరస్తసుశబ్దవిశేషవాచ్య మై
యుత్తమకావ్యముం బలె సదుజ్జ్వలభావరసప్రధాన మై. ౨౭౧

క. దయపడుటనొ గురుజను లని, భయపడుటనొ శాంతి నేమొ బాణాసనశ్ర
చ్చయములు గనువాడుటనో, కయి నిర్వ్యాపార మయ్యెఁ గందర్పునకున్.

చ. అలరులవిల్లు నీరసత నందఁగ నాఁకటిచిచ్చు హెచ్చఁగా
*వలియుచు వీడివీడిపడు బంభరపాళి ధనుర్గుణంబు చేఁ
గలుగదు కార్యసిద్ధి యని కంజశరాసనవీరుఁ డత్తఱిన్
విలు గొనకుండఁగా విడిచె వేళమ యూనతి కేలుఁదమ్మికిన్. ౨౭౩

సీ. సజలాంబుదంబున జతకూడి యెడయక మెఱయుచుండెడు కారుమెఱుఁగు పసంగ
హరిమణిస్తంభంబునందు నందము మీఱఁ బూన్కిఁ జెక్కిన పైఁడిబొమ్మ యనఁగఁ
దనరారుసహకారతరు(వు)తోఁ బెనఁగొంచు లలిమించు మాధవీలత యనంగఁ
బరమకారణ మైనబ్రహ్మంబు ననుసన సంగతం బగు చిత్రశక్తి యనఁగఁ
గాలిచేఁ గాళిందినెమ్మేను భువనభయని
వారణాధారణాటోపవాసుదేవ
ఘనభుజాదండసంతతాక్రాంత మగుచు
మించునలయిక వోలయు నిద్రించువేళ. ౨౭౪

గీ. ఏకశయ్యాపదప్రవేశైధమాన, మూర్తు లగుచును దంపతుల్ పొలిచి రపుడు
నేకశయ్యావసప్రవేశైధమాన, మూర్తు లైనయలంకారములసరణిగ. ౨౭౫

సీ. చక్రవాకీశోకచటులాంధకారంబు దొలుకకుప్పాతమంబుతోడ విచ్చె
నమరమూర్ధన్య†దిగ్రమణీయకాంతితో ఘూకోష్ణనిశ్వాసగుణము హెచ్చెఁ
బంకజామోదసంభవముతోఁ గలునలం దదభావసంభూతి గదియవచ్చెఁ
దరుగతపక్షిసంతతిశబ్దములతోడఁ జోరనిశ్శబ్దత సొగియఁజొచ్చె
సకలలోకసదాలోకనాంజనంబు, సారధర్మప్రచారాదికారణంబు
జారసంచారదుర్గ్రహోచ్చాటమంత్రి, రాజమగుచు‡నుష స్త్వేళ తేజరిలఁగ. ౨౭౬

గీ. సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర, బోధ మైకొని వేగంబ పువ్వుఁబోఁడి
సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర, బోధ వేగంబ చెందుట పోల్కిగాఁగ.

---

* ఒఱలుచు మూఁగిఁడలుచు అనిలఁడపాఠము? † దిగ్రమణాడుగంబుతో ‡నుష స్త్వేళ

ఉ. అంతట నింతియోర్తు నగ వాసన మానుకొనంగఁ బల్కె నీ
యింతికిఁ దోడు గావలెనె యిక్కడ కక్కడనుండి రాఁగ నా
వంత భయంబు లోఁగొనక యాత్మవిభుం డరుదంద నీనిశం
గంతుదురంబుఁ జేసి పలుగాయము లందినమేటి గావునన్. ౨౮౫

ఉ. అప్పుడు నీలవేణి చెలియందఱుఁ జేష్టలు చూడఁగోరి యో
యొప్పులకుప్ప నీదుమది కొప్పగ తేఁ డలపూన్కిఁ బూనెనే
తప్పక చెప్పు మన్న నగుఁగాల్చుట సిగ్గున మోమువాంచుటం
జెప్పెను నాతి యంతరము చిన్నెలు చెప్పఁగఁ బౌనరుక్తిగన్. ౨౮౬

వ. ఇట్లు కాళిందీమిళిందచికురం గరగ్రహణంబుచేసి యనంతరంబ మిత్రవిం
దాకుందరదనం బెండ్లియాడి నాగ్నజితీరూపవతిం జెట్టవట్టి భద్రాభద్రే
భయానం గాలుద్రొక్కి మద్రరాజన్యకన్యక యైనలక్షణకుం బొట్టుగట్టి
యష్టమహిషీనయన చకోరశరదాత్రికానిశాకరుండై యక్కవటయాదవవ
రుండు పిదప నరకాసురుం దునిమి (యింద్ర) లోకంబునకుం జని యదితిచేఁ
గుండలంబులు గొని పారిజాతనగంబు సంగ్రహించి నరకుం దునిమి) తత్కా
రాగృహానీతషోడశసహస్రరాజకన్యకల నాత్మకరగ్రహణంబున ధన్యలం
గావించి తద్భావతనిరంతరప్రమోదాపాదనదక్షిణుం డగుచు దక్షిణుండై
ధీరలలితనాయకోత్తముం డన వెలయుచు మునులకుఁ దపఃఫలం బై యరి
వీరులకుఁ గృతాంతుం డై యర్థులకుం జింతారత్నంబై ధనుర్ధరులకు వీరా
గ్రగణ్యుండై విద్యార్థులకుఁ బరమాచార్యుండై గాయకులకు వాగ్గేయకా
రశిరోరత్నంబై శరణాగతులకు వజ్రపంజరంబై విదగ్ధులకు (ర)సికావతంసం
బై మదవతులకు నభినవమదనుం డై సంఖ్యావంతులకు శాస్త్రవేత్త యై
నటులకు హల్లీసకతల్లజుం డై కర్మఠులకు ననుష్ఠాతృప్రకాండుండై తత్త్వవా
దులకుం బరమతత్త్వం బై యోగీంద్రులకు లక్ష్యం బై (రస)వాదులకు జగ
దేకరసంబై సుగుణవాదులకు నుపాస్యం బై భాసిల్లుచుండె నయ్యవ
సరంబున. ౨౮౭

సీ. *శాస్త్రంబు గతి ననుష్ఠాపకత్వవిలాసభాసురంబై చాల వాసిఁగాంచె
దా(హకరో)దారదవకేళి వంధ్యాకుమారునితోఁ బొందు గోరుకొనియె.

( ) ఈనడిమి వాక్యము సందర్భశుద్ధిగా లేదు *శాస్త్రంగు నీల-